వనసలతత్వంబు - క్రిందబాజలతత్వమొందబశ్చిమము - సరయులోగమ్మి
యుత్తరమదీపృథ్వి - యిరుదోటమలవాయువిలదక్షిణంబు - నమమా
కసంబిట్లునాడీయుగంబు - నెడపకభూతంబులేనువలిశంప - వరుసన
నిరువదిశ్వాసముల్ప్రాణ - మరయదప్రాణంబులారొక్కగడియ -
యొక్కొక్కగడియకొక్కొకభూతవేళ - యక్కనసూర్యుంసుచంద్రుండున
డువ - నక్షరనొక్కొకనాడియందయిదేసి - గడియలైచను నైదుగడియ
లుగూడ - నదియతొనుకలగ్నమట్టెంగ్నంబు - లాదవంగబంద్రెండునె
కదినంబగు - వెరసియిర్వదియొక్క వేయునార్నూరు - స్వరము
లాస్వరములసంవత్సరములు - గడియలైచనునట్టిగడియలర్వదిట - పడి
ఛాలుగొనగనువచ్చులబ్ధంబు - దినములాదినములుదివులపంద్రెంట -
మనసిడిపాల్గొన్న మాసంబులగును - నడిసనునట్టిమా
సధ్రువప్రోక్తి - నడచునాదినవారనక్షత్రయో
గ - కరణగ్రహాణపురోగమకాలచక్ర - కరణియుస్వరచక్రకరణియొక
ముగ - యిఃశశిపక్షంబులినశశితిథులు - నినశశివారణంబులినశశి
గడియు - లినశశిగ్రహములుజనితమైనాళ్ల - జనువిషామృతసముస్వరసం
గమములు - హానివృద్ధులునురుజారుజాములును - మానావమానముల్
న్యూనాధికములు - నతులజయాపజయాలాభలాభ - గతులుకాలజ్ఞాన
శాలవంచనలు - కలితహృత్పద్మోపకంఠలిప్తాష్ట - దళజీవహంసనంధాన
ఫలములు - నవయంబునాత్మోదయంబందగాంచు - ననుభవసిద్ధియు
నాత్మశుద్ధియును - వరవలీపలితవినజీతాంగములు - సురుచిరాకార
ముల్ సుకుమారములును - యమనియమాదులునణిమాదిశిద్ధు - లమ
రదశప్రత్యయములుసాంగముగ - చరిజలుచిందులుచొపదల యోగ -
పరిభాషలల్లనబాడుచుమంది - చెంతలజేరకేకాంతపక్షముల - నంతంత
నడచునభ్యాసయోగులును - కురునెరికట్లమునుంగొంగులక్రింద - నెరగు
లుదగునుట్లజిక్కనిరించి - చెలువగుబయనంపుచెప్పులుమెట్టి - పలుచని
ఛోళ్లుసప్పసములుబూని - పదపడియులతిసుప్పట్లగొంగెడలు - వడలకుం
డగమీదవల్లకుల్ సుట్టి - తోడవులునిజతనుద్యుతులకుమాటు - పడునని
యాత్మహోత్సాహంబివోదక - మెండలుపుంగళసూత్రముత

చాల్పునట్లు - పాదలుపుంగళనూత్రములు ధరియించి -
యలసియునలయనియట్ల వాధులకు - బిల్బిలిలావులబిగువుసూపుచును -
యలయకయలసినయట్ల నాథులకు - బిలబిలసొలువులబిగువుసూపుచును -
కొనుచుదలిపై నెక్కళ్లదిగుళ్ల - తమతమపతులహస్తములూదికొనుచు
కరముప్పతిలునలికంబులచెమట - కరతలాంగుళములగళిచివైచుచును
చందనాదిమ్రజచలనసంభూత - మందానిలంబు చేమతులజేలుచును -
క్రాలుతుమ్మెదలరెక్కలుపీకదాక - రాలుపుప్పొడికెశిరంబులొగ్గుచును
చూతవటాంకురజొంపముల్గొన్న - శీతలచ్ఛాయలజిక్కగోరుచును - ప్ర
సృమరబహువిధప్రసవసౌగంధ్య - లసితవాసనలనుల్లములుసోలుచును -
బింబాధరంబులబీటలణంగ - తాంబూలసారామృతమునదన్పుచును -
వదనపద్మంబులువాడకుండంగ - బొదలితలిచుట్టే లేబొదలడ్డమిడుచు - క
రతలంబులనురక్తములూరకుండ - కరతలంబులురొండ్లగడియించుకొను
చు - బిగిపెపెందొడలుబొంపిరిరాయకుండ - నగిరాజహంసలట్లొయ్యా
నజనుమ - నుల్లంబులనుగమనోపతాపంబు - మల్లడిగొనకుండమల్ల
య్యయనుచు - పటుతరాధరసముద్భటనిదాఘూర్మి - చిటులుగొనకయుం
డకిరిగిరియనుచు - బొరిపొరినీక్రియబుకుషులుదారు - నిరవిబుధాంగ
నానివహమేతేర - చుక్కబొట్టులుచిక్కిచిక్కివెంట్రుకలు - చక్కనిపావ
టల్జంగాళములును - యినుపనేవళములుయిత్తడిసరిగె - లునువెం
ట్రుకలదండలునుదగరంపు - బిల్లెండ్లుచుట్టియల్ జెక్కనన్నియల - డొ
ల్లుకుప్పసములునల్లగాజులును - కలయుంగజెవ్వులసంకెంపుబూసలును - ప
లువూసపేరులబన్నసరములు - కుటిలంపుమనసులుగొయ్యాకాటుకలు
పటికంపుముక్కరల్ భావమైతనర - చిలుకలముప్పలనెలుకలనేము - కెల
కొంకులనుబిచ్చుకలగొరవంక - పక్కలనుముతలనముఖులబంది - కొక్కు
లగోళ్లనుకుక్కకూనలను - యింగిలీకులలేళ్ళముంగిసలనుని - జాంగసల్
గొనివెన్కనరుసుదేరంగ - పలువన్నెకోకబొంతలనట్టనడిమి - తోలుబలకు
ప్పసములదూదిజనమొడలు - విసుమాపములుజూటివెంట్రుకల్ వెసద -
నొసలియిట్టుకబొట్టుబసవునూగన్ను - గవకొటుకలుదరకాయకప్పెరలు -
జెవులకీకెలుమొరనెకిబొరముండ్లు - చాకిటితిత్తులుచక్రములిడుపవ - తో

కళచ్ఛదములుదాకపొట్టలును - యొడ్డురొమ్ములుదొడ్డయూరులుబిగువు
నొడ్డియాణములిన్నయుంగరంబులును - కడియములముగువులుగరగచ్చె
రలును - గొడుగులుగుడియలుగోకజల్లెడలు - వర్ధ మొగంబులుపలిపెల
పుజెముక - జడ్డెలగూర్చినపచ్చడంబులును - ముంపెపుసకుపులుము
గ్రలిత్తులును - విరసంపుమాటలువికృతవేషములు - పల్లకీసంబులువ
రికిగడ్డములు - నల్లమేనులుగబ్బనారసంబులును - యుండుముదితనము
లుహాకనైచుటలు - కరకత్రాడులువెట్టుకసాంగములను - పసుగొ
నదనుజూచిభవిభవియనగ - జెనుశీలసంతులుబెట్టసత్రములు - సుక్కో
క్కలింగంబునెగిజూడకున్న - నక్కడకరగనీనాకట్టయనుచు - గళము
నగట్టైనగరులుదోపంగ - నలకుచుసాక్ష్యర్థమైవరించుంది - జోగులు
నుదారుజోగివేషముల - జోగులుగొలువంజోగువతేర - చెల్లియున
యరకాళ్లనుబిల్ల - వేళ్లుపెక్కగునరకాళ్లనునుట్ట - కాళ్లుకాటమో
కాళ్లనుదోలు - కాళ్లనునెండిన కాళ్లనుములక - కాళ్లీచట్టయున కాళ్ల
నుగుజ్జు - కాళ్లనైమొంబొట్టికాళ్లనుముడకు - పెంగులునిండి పింకులు
నొకుగు - బెంగులునెండొంటిపెరుగులుబిల్ల - చేతులులోవంకచేతు
లుతోలు - చేతులునెండొంటిచేతులుజాల - గుంచచేతులురొమ్ము
గోరంజులువీపు - పొరడులువిరిగినభుజములునంటు - మోపులనుబోడిగపొడ
పైనమక్కి - మెడలునుగడుగడునిడుదమూపులును - మురగిమోము
లు ముకు మొంజెములబంకి - బెంగురు పం లు బెంగులు నుండి -
యుటక్రిందుదప్పమోమంత యునొప్పి - పటురూపసౌందర్యభావాతిశయత
బరగుదేహంబులుపాటిల్లినట్లు - తనుఖలునాప్పులునముజూపిబ్రతుక - గ
శమునలింగంబుగద్దెనగరులు - పొలయురు దాడులుభాతియువలుద -
మకుటములగ్గోహాళుల మరియొకజెలులు - ప్రకటితంబుగబాల్యబదీనవృత్తి
గనుగొననిన్నబిడ్డలగట్టియున్న - యంబోతులనుగుజ్జుబెద్దలనెక్కి -
తలజగత్పావనత్వమునివ్వటిల్ల - నలనద్మప్లబగగుణారంబొవన - బది
పడియాత్రికియబగలెల్లనడచి - వెదకుచుమాపటవేలముల జేరి - చనజ
నదుండటవెనుకకునొడి - జనులెల్లదారమొపంగరాయనుచు - యేల
య్యంబు... మవమాయట్టి - చే

నులనురి యొక్క దేశంబులకును - పోనీక వృత్తులు భూములు గన్ని - దా
నములు హిరణ్య దానముల్ వస్త్ర - దానంబు లన్నాది దానములెక్క
భోతుల నెడ్లను బోగళ్ల నిచ్చు - దాతమా బసవదండనాయకుని - భూ
మిలో బోలెడి సామి బగుతుండు - దామరియొకడు లేడా మల్లినాథ - దార
మొసంగ రాధర్మాత్ములార - రారోరియని ముము జేరంగ బిలిచి - యేల
యీయిందులో నెవ్వ రేగ రుణ - నాలించి యక్కటా యనుచు మాయట్టి-
దీనులకు నుకృపా దానంబు భూమి - దానంబు నభిమత దానంబు లిచ్చు -
శిరియాల శెట్టి నిగరికాల చోడు - నరియను రాజు సేనాధినాథయ్య - చేర
మరాయుని సింధు బల్లహుని - వీర చోడనిగరయూర చోడన్ని - శివలింగ
దేవుని సిద్ధరామయ్య - సవరదనాదయ్య సామవేదులను - భూమిలో బోలె
డి సామి బగుతుండు - దామరియొకడు లేడా మల్లినాథ - దార మొసంగ
రాధర్మాత్ములార - రారోరియని ముము జేరంగ బిల్చి - యేలయీయిందు
లో నెవ్వ రేగ రుణ - నాలించి యసరయ్య యక్కటా మాకు - వీవంగ జేతు
లు లేవంగ నడచి - పోవంగ గాళ్లను లేవయ్య యంధ - కులమయ్య పిచ్చు
క కుంటులమయ్య - తలపోయన భ్యాగతులము సుండయ్య - యగప
డే బెడగులమగు మము బ్రోవ - దగవగు జంగయ్య దయదల్చుడయ్య - ప
రమమాహేశుండు బసవయ్య కరుణ - శిరిగిరి నాథుని కరుణయు మీకు -
సుంకరబొంకయ్య సురియచోడయ్య - శంకరదాసయ్య లెంకమంచయ్య -
దేవర దాసయ్య తెలుగు జొమ్మయ్య - బావూరి బ్రహ్మయ్య బాచిరాజయ్య
భూమిలో బోలెడి సామి బగుతుండు - దామరియొకడు లేడా మల్లినాథ - య
నుచు బాడంగ ముందట వెన్కదోడి - జనులెల్ల వారమొసంగి రాయనుచు
నితర ధార్మికులని శ్లిన్ను చుమరియు - బ్రతిజూపు చును భక్తిపరుల వేడుచు
ను - వచ్చుచు బరుస భావనము సేయుచును - బిచ్చుక కుంటులు పెట్లేగు
దేర - గదియంగ దమతమ గ్రామముల్ వెడలి - నదియూడి గామల్లికార్జు
నదేవు - శ్రీపాదములు దర్శించు నంతకును - చూపరుల్ సంస్తుతించుచు
గొని యాత్ర - నలరంగ గొనియాత్ర నశ్వమేధంబు - ఫలము నిజాంఘ్రిస ప్త
కమంగ మాట - దనరు శ్రీశైలయాత్రా ఫలంబునకు - తనవుల భువి మా
నదండ ముబాట - డాయ సాష్టాంగ దండప్రణామములు - సేయుచు జలగి

చెచ్చెరవచ్చువారు - కదియంగతమతమగ్రామముల్ వెడలి - నదియా
దిగామల్లికార్జునదేవు - శ్రీపాదములుదరిశించుసంతతమును - చూపరుల్
సంస్తుతించుచుగొనియాడ - భోగయ్యవెక్క శంభుసముననన్న - బాగి
దియన్నట్లుభక్తిదలిర్ప - జెలఁగియంగప్రదక్షిణములునిగ్ధ - నలువుచు
బోరిబోరిజనుదెంచువారు - కదియంగతమతమగ్రామముల్ వెడలి - న
దియాదిగామల్లికార్జునదేవు - శ్రీపాదములుదరిశించుసంతతమును - చూ
పరుల్ సంస్తుతించుచుగొనియాడ - యీదినిరాహారులైపర్వతుండు -
గాదెయీశ్వరుఁజెందగాంచెదాననుచు - నిత్యోపవాసైకనిష్ఠావికల్ప -
సత్యవ్రతిష్ఠులైచనుదెంచువారు - గొడుగులుచెప్పులుకుంచెలుమంచి -
క్షవసంబులునేతకచ్చడంబులును - కుప్పసంబులుకట్టుగడ్డలుగోడ - త
ప్పరంబులుఁగమండలములుగద్దె - కంబళ్లుకప్పడికంబళ్లుగోర్పడంబులు
మోగదండములుదండియలు - పొత్తిలంబులుగరతిత్తులునడప - తిత్తు
లునానెసిద్ధియలునుమోగ - పట్టెఁబునారతివలకలునాల - పట్టముల్
నిలువులవల్లికల్వేరు - సరిగెలుసంబెనల్ సానలుమృగ్గు - పలకలుదీపగం
బములువిభూతి - పూసలురుద్రాక్షములుపటికములు - గాసదంబులు
గానిగద్దెగరులు - శివసూత్రములుగవసెనలవస్త్రములు - వివిధోప
కరణముల్వీసనఃబ్జులును - గంధంపుకప్పలుగరవటంబులును - గంధంపుజె
క్కల్సుగంధవస్తువులు మరియుఁనివివిధాభిమతపదార్థములు - బెరుకల
గావళ్లఁబెంపారదెచ్చి - యడిగినచోటననడిగినవారి - కడిగినవస్తువులర్థినిచ్చు
చును - వలసినచోటనవలయువారలకు - వలయుపదార్థముల్వారికిచ్చు
చును - యలసినచోటనయన్నపానాదు - లలసినవారికయపుడయిచ్చు
చును - చలిపందిరులునత్రశాలలుగాల్లు - చెలిమెలునంతంతసేయబంచు
చును - యంతంతబదిపలంతంతమరుగు - లంతంతవిడిపలలనువులు
గాగ - భంగిగాజేయుచుభక్తులిమ్మాక్కి - జంగమారాధనల్ సలువు
చునడవ - మరిబకిమతోట్టిమదిమారిపించి - దరితరిబదపదార్థంబులి
చుచ్చును - యుదకంబులుదకంబులుదకంబులనుచు - నుదకముల్వో
యుచుమనోగివచ్చువారు - పుష్పముల్పుష్పముల్పుష్పంబులనుచు - పు
ష్పంబులిచ్చుచుబోరివచ్చువారు - ఖజ్జముల్ఖజ్జముల్ ఖజ్జంబులను

చు - ఖజ్జంబులిచ్చుచుగమనించువారు - వీణెనుమ్రోసెదుమ్రోడెంబులను చు - వీడెంబులిచ్చుచువెసనచ్చువారు - నడనజాలనివారినడిపించుకొను చు - నెడనెడనొయ్యనసేతెంచువారు - మఱియునక్రియజంగమంబుల రీతులు - దరితరినతేరదండతండములు - నమనయించుచుగొని యాడుచువారి - కనుపట్టిమ్రొక్కుచునడుగుచున్నంత - నాకొనిమ ధ్యాహ్నమగుడునుబకుస - వీకతోనొక్కొక వేలముల్గాగ - సందశించు చుదరుచ్ఛాయలబొదల - గొంకులగోవలగుహాల శైలముల - మరుగు లగొంకలమాటులనదుల - గురువలబిలములగుండ్లమెత్తలను - చక్క నదమతమచక్కట్లవిడిచి - రొక్కొక చెరుల గ్రియ్యాటలుబొదల - బా వులగుంటలపద్మాకరముల - వావిరిధారలవలతిబుగ్గలను - వంతలనే రులవాగులశైలల - గ్రుంతలజలములగూపాదులంపు - దింతలంబుల బోకతిత్తులగల్ల - తిత్తులరాగిబిందియలబేరుపుల - కుండలగలతెలగో ళ్లగోరలను - గింకులదొడ్డనమండలంబులను - గరగలబటువలగావళ్ల గూడ - గరతిత్తులనుయుదకంబులుగొనుచు - ఘనతరంబుగదేవగండ్లలి దవన - మునురుద్రజటమర్వమునఖండబిల్వ - పత్తిరినావురుబత్తిరిమా చి - పత్తిరిసేక్రేడుబత్తిరిజమ్మి - పత్తిరిగాంచనపత్తిరిపచ్చ - పత్తిరిమా రేడుపత్తిరివెలుగ - పత్తిరివావిలివరుసనుమ్మెంతి - పత్తిరిగన్నేరుపత్తి రినెల్లి - పత్తిరితిరునెల్లిపత్తిరిముసిడి - పత్తిరిసోమెందపత్తిరిగోగు - పు ష్పములునశోకపుష్పముల్పొగడ - పుష్పముల్గేదంగిపుష్పముల్మల్లె - పుష్పముల్సేనతిపుష్పముల్మొల్ల - పుష్పముల్గరవీరపుష్పముల్దుమ్మి పుష్పముల్ల్లేపుష్పముల్శేల - పుష్పముల్గురువిందపుష్పముల్ బొన్న - పుష్పముల్వీరవాదిపుష్పముల్ములక - పుష్పముల్బ్రాకు డుపుష్పముల్జాజి - పుష్పముల్దామెరపుష్పముల్గలువ - పుష్ప ముల్కింశుకపుష్పముల్సురగి - పుష్పములూడుగుపుష్పముల్గ్రోవి - పుష్పములుగొరవిపుష్పముల్గలివి - పుష్పముల్దంగేడుపుష్పముల్ మొలగు - పుష్పముల్మారేడుపుష్పముల్మంగ - పుష్పముల్గోరంటపు ష్పముల్బీర - పుష్పముల్చెంగల్వపుష్పముల్వేల గ - పుష్పముల్గిరిమల్లెపుష్పముల్స్వర్ణ - పుష్పముల్ల

మొదలైనపుష్పములుగొనుచు - నొంటొరుగడవంగనుద్వృత్తిజనియ - ఖం
డితమతినారబండినరేణి - పండ్లనుమామిడిపండ్లనుయీడ - పండ్లనునే
రేడుపండ్లనుమొరవి - పండ్లఖర్జూరపుపండ్లనుపరికి - పండ్లహింతాల
పుపండ్లనుజీడి - పండ్లనుజటిమిటిపండ్లనుజాణ - పండ్లనుదాడిమ్మపం
డ్లనుమేడి - పండ్లనుచిరినెల్లిపండ్లనుమొరలి - పండ్లనుమారేడుపండ్లను
బలుసు - పండ్లనునులివిందపండ్లనుదునికి - పండ్లనునారంగపండ్లననం
టి - పండ్లనుగజనిమ్మపండ్లనుగలిమి - పండ్లనుగిమ్మరేబండ్లను జేన -
పండ్లనుకలజువ్విపండ్లనుద్రాక్ష - పండ్లమాదీఫలపండ్లనురావి - పండ్ల
న్యగ్రోధపుపండ్లను వేప - పండ్లనుగేదపుపండ్లనుబుడుమ - పండ్లజంబీర
పుపండ్లనుదోస - పండ్లనుజలుపుపండ్లనుపాల - పండ్లనుజవిలికపం
డ్లనుబనస - పండ్లను మొదలైనపండ్లను వెలగ - కాయలు రేమిడికాయ
లుగలివి - కాయలుమామిడి కాయలుచిగురు - లిప్పచిప్పను దేనెలివి
యాదిగాగ - తప్పకఘనవనాంతరములగొనుచు - వేగంబతమతమవే
లంబులకున - మాగతులై యీశ్వరార్చనల్ జేసి - ఫలములుఖజ్జము
ల్బడిమోగిరములు - నలినభీష్టాన్నపానములుభోగించి - సంబరంబున
బరిపత్కోటియంత - తాంబూలములుగొంచుతండతండముగ - తో
ల్లింటియట్లనుత్సుకతబాడుచును - తృళ్లి నాడుచు గెడతోడగూడుచును
మెల్లైనసాగుచు మెట్టుమెట్టుచును - కొల్లముల్ డిగ్గుచు గురువలెక్కుచును
మోలముల్ సాచ్చుచునుద్ధతిజనుచు - శైలముల్ ప్రాకుచు చరులగోరు
చును - గుంతలజారుచు గండులూరుచును - ప్రంతలదూరుచువారిశ
జనుచు - బంతులుసాగినపర్వతావలులు - గంతులైయున్ననగప్రతాన
ములు - గుంపులుగట్టినకుధరసంఘములు - బొంపిరిగొనియున్నభూధర
చయము - కూటువల్గాడినగోత్రసంఘములు - తూటుగట్టినమహాద్రు
లసమూహములు - గూడనిబ్రహాండకోట్లులబెక్కు - జాడలజంగమ
స్థావరప్రతతి - యబ్బుగూడయద్రిమయంబైనమాడ్కి - నటయిట్లకేవ
ముంపట వెన్కనడుమ - నేదెసజూచిననెన్నికమిగిలి - యాదెసదనరుమ
హాద్రులనడుమ - జూచుచుసంతసించుచుమహోత్సవము - లాచరించు
ఘనగణనరుగముఁబటను - శృంగారతరసదాశివపంచమోత్త - మాం

గకోటీరజటాటవీమధ్య - మంగళశ్రీవియద్గంగామహిత - రంగిణీరంగ త్తరంగోపకంఠ - సంగతినొప్పుభాస్వచ్చంద్రరేఖ - భంగిహృదయభంగ పర్వతకనక - పర్వతనక్షత్రపర్వతగద్య - పర్వతముఖ్యోరుపర్వతావళు ల - నడుమగంగామహానదిజూడనొప్పె - తడయకభక్తిజంద్రవతిబూజిం చు - మల్లికార్జునశిరోమండనంబైన - మల్లికాదామంబుమాడ్కి వెండి యును - భరితమైకానంగబడసిమ్రొక్కుచును - పరుసహృదయభంగప ర్వతంబెక్కి - గిరితుట్టతుదినుండిక్రిందుజూడంగ - సురగలోకముగాడి యునికికిబెదరి - పందలహృదయంబుభంగంబుబొంద - నందుండికోయని యాచీఁయుప్పొంగి -మునికొనిమాటలుముడియలువీవు - లనుగట్టుకొం చుదలల్ముడ్చికొంచు - గట్టుకచ్చలుగట్టుకొనుచుబైవలువ - సుట్టుకొంచు నుభయపట్టుకోయనుచు-మెల్లనమెల్లనమెట్టుచుజనుచు - నెల్లనెల్లనమం దికోసరించుచును-యొడ్డురాలెక్కుచునొదికిల్పుగాళ్లు- నడ్డగించుచుబాపల రసిద్రొక్కుచును- దిగ్గుమువృద్ధులదిగబడనీక- డగ్గరిబట్టుచుడాకొనిజనుచు గడగడవణకుచుగాళ్లుజమర్చ - దొడలూదికొనుచునుద్రోపుద్రొగ్గిళ్లు - వాకుచుగ్రెగ్గొడలూరుచునెడల - దారుచునూరులజారుచుజనుచు - సి కుకుచునటుగొంతసింతరించుచును - చక్కనహృద్భంగశైలంబుదరియ - నప్పర్వతాదిమధ్యాంతముల్గాడ - నొప్పెపరుసప్రవాహాపేక్షదనరి - కడుద్రియంబకనగాగ్రంబుననుండి - కడునొప్పుగౌతమీగంగాప్రవాహ మేపారనిద్ధాత్రికేతెంచుపగిది - నాపరివతోకటియంతనేతెంచి - సంగ తిహృద్భంగశైలసమీప - గంగాప్రవాహోపకంఠదేశమున-పోకమా కులనందిపొన్నలగొంది - మోకమావులయుతమొల్లలకరత - పనసల పొంతజంపకములవ్రంత - ఘనసారములయిరువనటులగురువ - గమ్మరే ణులట్రోవగడమలక్రేవ - నిమ్మపాదలనీడనేరెళ్లగూడ - కొండగోగుల వాకగురిజలయాక - బొడ్డుమల్లెలయోరబూరుగుసేర - కరవీరములకట్ట గరుగులమిట్ట - సురగులనొద్దనశోకంపుమిద్ద - చెంగలువలకుంటజిం దలపొట - గంగరేణులమూలకాన్గులమ్రోల- మందారములక్రిందమా రేళ్లక్రింద - చందనంబులచల్వజాదులకాల్వ - సరళముల్ తొయభూ జంబులవాయు - కుసుమకంబులచెంతగోపులగంత - హింతాలములచా

యనీజలవాయి - సంతానములయింటజమ్మలజంట - పటములమల
లలవంగంపుకేలల - కుటజంబులెజలగుగ్గులములమడల - గూడజప్వర
ములుగుడిసెలుగుల్లు - గూడారములుదెరల్గొల్లెసల్ బన్ని - వేల
మల్లప్పకవిడిసెనుత్తున్కత - గ్రాలుచుఘనతగంగాసంగమమున - జని
కృతస్నానులై జన్మసహస్ర - ఘనఘోరకర్మపంకముబొంకమొకలి - యం
తమిష్టాన్నపానాదివస్తువుల - సంతృప్తులై పరితోడియులర - ప్రఖ్యా
తిదోనసురాజయ్యగారు - ముఖ్యంబుగాగణములుహర్షమునను - సం
తతమున్న సంధ్యావేళలంచు - నంతమహానిశియందుసాంగముగ - న
త్యంతభక్తిసమగ్రతమొనసి - నిత్యలింగార్చనానియమముల్ దీర్చి - యి
ష్టలింగప్రసాదేచ్ఛానుభోగ - పుష్టిసుఖావాప్తిబొదలనంతంత - బసవన్న
గీతముల్పసరించువారు - బసవపురాణముప్పగజప్పువారు - భరితోక్తి
నేలలుబాడెడివారు - నరుదొందజిందులనాడెడివారు - ఆళతుల్ సేయ
చునలరెడువారు - శైలముల్ ఘూర్ణిల్లజయవెట్టువారు - నెట్టనశ్రమ
మేనిన్ద్రించువారు - బిట్టుమేల్కనిచూడబ్రియుపడువారు - గిరిసమూ
హములొప్పగీలించువారు - తెరువులచక్కట్లుతెలసట్టువారు - త
మతమరాకలుత్రలపోయువారు - సమిత్రఘోరాటవులంగ్గించువారు - నా
రబర్వతపురాణములుచదువు - వారునువినిమెడివారునుజెలగి - యిట్టి
లీఘనములునున్నెన్నడునెరుగ - మిట్టివోద్యములంచునెన్నెడువారు -
చెప్పెడిదేమియాశ్రీపర్వతమంచు - తప్పకనానాపతారములుద్దాల్చి - చ
లములై పసనకుజలములు జూపు - నిలలింగమూతులై
నేమముల్ నలుపు - పండినతరువులై ఫలములు
గురియు - నిండుమేఘంబులై నీడలుసేయు -
వల్లరులై పుష్పవాసనల్ సేయు - చల్లనిగాడ్పులై శ్రమములుమాన్పు -
నలిదారికాడయినడిపించుపథము - జెలయంగపనములై నిడుదలనిచ్చు -
బండితులై ఛెప్పబర్వతుమహిమ - గండదలాళులై కాచుమార్గములు
మహిబాటువృగములై నురుపిుచుటప్పి - విహగంబులై పాదవోడ్కలుపె
లయు - నతిథిరూపంబులై యర్చనలంచు - ధృతిబెపోముతులై దీవ
నలిచ్చు - [illegible] జంగమయోష

షై భక్తిసూపు - నెంతయు నాపున్లై హితములు సలుపు - నంతంతబల్లెలై యూ
సలుపుజూపు - భూరితీర్థంబులై పుణ్యుల జేయు - నారంగ జెన్నసులై ము
క్తులొసగు - గాకనీవరుసపై ఘనదయాబుద్ధి - గాకున్న నిట్టిదుర్ఘ
టమార్గదుర్గ - భూరిపర్వతమహాద్భుతగుహాగహ్వ - రాగణ్య హస్తి
మృగాసురచోర - నాగసంశ్రితనిర్జనప్రదేశముల - శ్రీగిరీశ్వరుగానవె
ల్లురావచ్చు - ననుచుబర్వతునిమహాత్వంబుగూడ - వినుతింపనప్పొద్దు
వేప్రుసునంత - దూరీకృతాఘుండుదోసమరాజు - గారుసుసద్భక్తగ
ణసమూహంబు - మదినుబ్బియవసరమహిమసాంగముగ - నుదయమ
జ్జనములుద్యుక్తి గావించి - యరుగుదెంచియతిసమంచితలీల - బరుస
యుడాపునపరిమితపుణ్యా - తరనిజపుణ్యయాత్రావిఘ్నహేతు - విరస
వి స్తరఘోరవిషయవారాశి - గడచినమాడ్కిగంగాప్రవాహంబు - గ
డచితదీయ్యపిబ్యాగప్రవాహ - పరిచితప్రత్యంతపర్వతావళుల - సుర
చిరాభంతపుచూరాద్రితతుల - వరలునత్యున్నతపర్వతమంత నెక్కి - తరిబ
రిసతో టిదావిగనాగి - కమనీయ్యసుదీర్ఘకానిత్యసంగ - మమున
కానదియేగుమాడ్కి నొప్పారి - భోరనసేగుచోబాంగుచుబెంక - మా
రయనొంత్రదన్నలకిపారుచును - సంతసిల్లుచును ఘీజయజయయనుచు -
నంతంతజిక్కు బెనలరియూర్జచును - తిప్పకయప్పురాతనతీర్థచెరుల
చొప్పరునజ్జులసోపానములుగ - ద్రొక్కుచు నెక్కుచు దొడిదొట్రుకొను
చు - చిక్కుచుమోకాళ్ల చేతులూనుచును - వంగుచు నాలుచుదొంగు
చుజనుచు - జెంగుచు నొండొరు జేయూడకొనుచు - చేకుకో చేనుకో
శిరిగిరినాథ - చేనుకోమల్లయ్య చేదుకొమ్మనుచు - చేనుకో చేనుకో శ్రీ
శైలనిలయ - చేనుకోమల్లయ్య చేనుకొమ్మనుచు - చేనుకో చేనుకో చే
జేతనొసయ - చేనుకోమల్లయ్య చేనుకొమ్మనుచు - గనుకలిపాటలుగ
ట్టిపాడుచును - చనిదనిదిండులుజతులకాడుచును - బరమోత్సవామ్న
తపరిపూర్ణపుణ్యా - తంపరిషద్భాండతతులుసంధిల్ల - శూలిశ్రీమల్లి
కార్జునుదయాను - కూలరజ్జులజేదికొనవెన్నల్ క్రియను - కట్టుకున
డినగాగ్రంజెక్కి వరుస - యట్టిదకాకట్లుహరుకృపతేక - చెచ్చెరదూజ
నోత్సేధమశ్లైక - వచ్చునత్యున్నతపర్వతమునానంత - నంతంతదత్పథ

శ్రాంతులై పరుస- గొంతవిశ్రమమందిగొబ్బునజెలగి - కట్టలుగట్టినక్షేత్ర
పర్వతము- బిట్టుగలగనెక్కపెట్టునగూడ - పర్వతాగ్రంబెల్లపథమశా
నెరవి - పర్వతయ్యామమ్మబాలింపుమనుచు - మ్రొక్కుచునీడలజక్కు
చు బం డ్లు - మె క్కు చు లీ ల లనుక్కుచునేనె - లెక్కుచు
శాలకుస్రుక్కుచుశలల - జిక్కుచుదెరువుల మ్రక్కుచుజలువ - ద్రో
క్కుచుదాపంబుదక్కుచునాత్మ - సొక్కుచుజనిచనిచిక్కుచుగిరులు -
నూచుచుకృతములమోచుచుభవము - బాచుచుధ్వజముతలదాచుచుచీ
ల - నేచుచుమార్గముల్గాచుచుబరుస - దోచుచుబడిపడిలేచుచు
వ్రతుల - బ్రోచుచుజేతులువీచుచుభక్తు - రాచుచుగూకలుపై చుచు
దరుల - దూగుచుదయ్యాలలూగుచుగ్రమము - నీగుచుబూదేనెదోగు
చుజలికి - దేగుచునెండలగ్రాగుచుబ్రియుల - కాగుచుమదిజెలరేగుచు
బ్రీతి - వీగుచుసురగులదాగుచుగముల - మూగుచుమెల్లనసేగుచుబా
దల - దూరుచుగుంతలదారుచుజరుల - జారుచుజనలేక పేరుచుహితు
ల - దూరుచునటుగూడజేరుచువారి - నూరుచుసందడిగీరుచుమంది -
మీరుచునతిథులనేరుచుమ్రొక్కు - దారుచుగోర్కె చేకూరుచునెడల -
నిలుచుచుఫలములవిలుచుచుదప్పి - దలచుచుదృష్టిమైబొలుచుచుగిసు
ల - గొలుచుచునిష్టమైగలచుచుభవము - గెలుచుచునటుగూడబిలు
చుచుమూక - గలచుచునదులకువలచుచుబలుల - మలచుచుబసప
న్నదలచుచుబ్రీతి - గ్రాలుచుశరనిధివ్రాలుచునాత్మ - సోలుచునెడద
ప్పిదూలుచునట్లు - తూలుచునాదంబుగ్రోలుచుసుగతి - వ్రాలుచునుఖ
లీలదేలుచుభక్తి - జాలుచుభవములదూలుచుబుధుల - బోలుచుమది
కోర్కెలేలుచుశివుని - గూర్చుచునేమముల్ దీర్చుచునుతులు - బే
ర్చుచునలిరేగియార్చుచుమునువు - చనుచువీడియములుగొనుచుమీ
శరణ - మనుచుజంగమముగన్గొనుచుదాళముల - గూడుచుశిరిగిరి
బాడుచుజతుల - కాడుచునొసగులువీడుచునలరి - కోయంచుచాం
గుభళాయంచుమల్ల - యూయంచునుఘెయుఘెయంచునుగూడ - జ
యవెట్టుజయవెట్టుజయవెట్టుడనుచు-జయజయజయజయశరణమోయను
చు - నరగలిగొనకిట్టులఖిలదేశముల - పరుసయునానందభరితమైనను

క - నరుదొందనంబులో నాంధ్రదేశంబు - పరుసజిందులుగట్టి పాడు బొట్ల
విన - నల్లవో నల్లవో నగరాజరాజ - మల్లయా మల్లయా మహాసీయ్య తే
ట - పరమపాతకకోట్లు భస్మమై తూలు - శిరిగిరిమల్లయ్య శరణన్న జాలు
శ్రాబోవ నెంత దూరంబైన నిలువ - నే బోవ మల్లయ్య నేటేటగొలువ -
పాతాళగంగ దాబ్రభయంతరమైన - జాతు నే మల్లికార్జున దేవునైన - చు
క్కలపర్వతంబెక్కు డేదైన - జక్కకపోమ నే శిఖరేశుగాన - నాయ
కోత్తమ చిక్క నాయకదండ - నాయకుజసవన్న బాయక గొలుతు - శృం
గిబొప్పయ నుత్తమాంగదకేశి - సంగనబసవన్న శరణని కొలుతు - పండి
తారాధ్య శ్రీపతిపండితయ్య - బలడారు బసవన్న బాయక గొల్తు - శం
కరదాసయ్య తెంకి మంచయ్య - బంకయ్య శివరాత్రి నంకయ్య శరణు - యే
లేసు కేతయ్య యిందశాంతయ్య - మోళిగ మారయ్య ముస్నయ్య శరణు
బాపూరి బ్రహ్మయ్య బాచిరాజయ్య - కోపూరి బ్రహ్మయ్య గొగ్గయ్య శర
ణు - కిన్నర బ్రహ్మయ్య కేశిరాజయ్య - కిన్నర బ్రహ్మయ్య గణదాసి శర
ణు - బాచయ్య సవరద నాచయ్య బిబ్బ - బాచయ్య మడివాలు మాచయ్య
శరణు - శిరిగిరి శరణు శ్రీగిరినాథ శరణు - శిరిగిరిమల్లయ్య శరణుల శరణు -
లను చుసిక్రియను బ్బియాడు బాడు - చునుబేద్రిణి బేద్రిణి యుత్సుకతమై
నడప - చెన్నారమరియాల్లు కన్న పరుస - ప్రసన్నికి నాటల భావసాంగ
ముగ - అంగమ దేవయ్య బిజమ్మామయ్య - నిజభావ దేవయ్య నీవింతబ
న్న - యల్లను దేవయ్య అత్తికోపహాది - బల్లడ దేవయ్య బన్ని కేనివు - శి
వముక్తదేవయ్య శిలుకలరయ్య - శివరాత్రి బసవయ్య చిత్తిపన్నయ్య -
విరుపాక్ష దేవయ్య కరశిసుబేగ - పురవాశిసంగయ్య హరుతబారయ్య -
మహాలింగదేవయ్య మంది చేక్షయ్య - సహాసుఖ దేవయ్య సరసరబన్ని - భ
వగొడి దేవయ్య బాడె వల్లయ్య - శివదేవనిల గెజ్జశీ సుదాబన్ని - గురుదేవ
నీకుశిను శిదాద బేక - శిరిగిరి యిసుని మ్మ శిరిగిర ల్లయ్య - సంగి దేవయ్య
ప్రసాది దేవయ్య - లింగి దేవయ్య యుత్తుంగ దేవయ్య - యమృత దేవయ్య మ
హత్త దేవయ్య - విమలాత్మ దేవయ్య విశ్వనాథయ్య - సర్వజ్ఞ దేవయ్య
పాలి దేవయ్య - ప్రబ్బిత దేవయ్య భద్ర దేవయ్య - బాణ దేవయ్య పుణ్యాణ దే
వయ్య - బాణ దేవయ్య కల్యాణ దేవయ్య - పరుసపేరు యిత్తు బెగ బన్ని య

వగళ - తరలాటనావునిందతక్షిలవెనుత - గుడ్డవ్వదుగ్గవ్వగొగ్గవ్వబన్ని - షాడ్డలసోమవ్వషోడశిబన్ని - హెమ్మవ్వరెమ్మవ్వహెగ్గవ్వబన్ని - అమ్మవ్వనిమ్మవ్వజొమ్మవ్వబన్ని - హెల్లవ్వహల్లవ్వహేచవ్వబన్ని - మల్లవ్వచెన్నవ్వమాదవ్వబన్ని - అక్కవ్వకక్కవ్వఆదవ్వబన్ని - జక్కవ్వశేకవ్వసాంతవబన్ని - గంగవ్వరామవ్వకామవ్వబన్ని - సంగవ్వలింగవ్వసింగవ్వబన్ని - ప్రమథవ్వరుద్రవ్వభద్రవ్వబన్ని - కొమరవ్వవిమలవ్వకొమ్మవ్వబన్ని - చన్నవ్వహొన్నవ్వకన్నవ్వబన్ని - జన్నవ్వసాకవ్వసత్తెక్కబన్ని - శరణవ్వసాతవ్వసరళవ్వబన్ని - పురుతవ్వఅప్పవ్వబొప్పవ్వబన్ని - మత్తఅల్లడదేవిమల్లడదేవి - బత్తులేశ్వరదేవిబసవలదేవి - సరదేవిగురుదేవివిరుపాక్షదేవి - శిరిదేవిమహాదేవిసిద్ధలదేవి - బసులదేవియునుద్భటమహాదేవి - సమభావదేవిబాసలదేవిబన్ని - ముందిహొగలుబెడమందతాహొల్ల - హిందెనిల్లలుబెడయిరుబట్టుబయలు - ఉలుకదేసిల్లడేవోదాగిసమ్మ - బలదల్లికొలదల్లిబన్నిజన్నిసుత - వారికారరుతిమ్మవరదిందబరలు - సారెపర్వతవేదుసంతోషదల్లి - వొబ్బరొబ్బరునోడికొబ్బతల్ మనద - లుబ్బుతల్ మత్యంతహబ్బుతల్ ముసువకొరవుతల్ బలికేశుజరవుతల్ సురతి - నెరతదల్ దేహవంమరవుతల్ మత్తెలిభువుతుల్ మందియొ సుభువుతల్ ప్రియువు - బెళవుతల్ జననవంకెళవుతల్ పురువు - నోడువుతల్ తమరెతాగుడువుతల్ వరిదు - హొడితల్ కుణికుణిదాడుతల్ సాక్కి - వీళతల్ ముదదింద బేడుతల్ శివున - కేళుతల్ భక్తరన్ హేళతల్ మహిమ - సాళుతల్ సమయగళ్ వీళుతల్ వంకి - పేళుతల్ మందిదొళ్ దూళుతల్ నెరహి - సింధుగళికుక్కతల్ సిద్ధిలొళగళు - సంధిసుతల్ తాళజతిగమెట్టితలు - నడుదవర్ సష్మ్రవర్ నావెకేహిందె - నడనడెయణుతసందణిసుతక్యాణి - కయ్యతాళంగళకవినుబారిసుత - మెయ్యెళ్లబాయాగిమృడనహాడిరిభొ - హబ్బుత్తకొబ్బుత్తహబ్బిహాసుత్త - ప్రబ్బతదొడయంగిభక్తిమాడిరిభొ - హాసుత్తలాసుత్తనోడుత్తభక్తి - మాడిభొశిరిగిరిమల్లికార్జునగె - ప్రాణేశనసుగెశ్రీపర్వతదొడయ - పూణిదెనెనయిభొమల్లికార్జునగె - హరహరశివశివశర్ణుబనువిన్నపపు [illegible] - పరసుపాతకగళుప

నిహ సువను - శిరిగిరిమల్లయ్యశరణన్నిరయ్య - మంగళమూర్తినుల్లి
య్యనాళు - సంగనబసవయ్యశరణన్నిరయ్య - బసవన్న ఇష్టార్థ
కిహాళిగను - పసరిసిమాడిభోధ క్తిమల్లయగె - అనిఋల్లు [illegible]
పుచుబ్రీతి - బనుగొనక నాటబరుసయే తేర - నరు [illegible]
దేశంబు - పరుసమహారాష్ట్ర భాష బెంపార - మా [illegible]
బాపుమణత - భాగవతేపరభక్తతేమణత - చరలింగ [illegible]
మణత - పురుపరేఖ తెదూరిపుసుఖ తేమణతి - అఖిలిరి కై ల [illegible]
త - సుఖముఖాజాలోవుముఖఅమామణత - మగమహి [illegible]
పుయాజి - గగనరాణాయాజ్ఞి కైలాసయాజి - అఖుమరాణాయాజిను [illegible]
పుయాజి - సుఖకరఅష్టాదిశుభదేవుయాజి - అరకేశి హాబగుతెఅప్పా
లేలింగ - శిరిగిరిమల్లయ్యచరమదియంత - సుఖతాళజతిమాన శఖల
నాచె - మఖర జేశిరిగిరిమల్లయ్యరాణ - ఆళానిబంధనతాళగీతచ -
మాళాసమర్పణుమల్లయ్యరాణ - ప్రబ్బనాత్తాపసంగినాటకనె - ప్ర
బ్బతమల్లయ్యసచ్చిజ్ఞగాతి - అంసేమగావుయిఅరుజానుచిత్తి - అంసి
మహాభక్తఅఖిలసమ్మేళ - అనుచుచిందులువెట్టియాడుచుబాడు - చును
నారెవరుసయోజను చేరమకియు - సరుదొంద నట్టులనరవదేశంబు - ప
రుసయుద్రావిడభాషసాంగముగ - అరుణగిరి తెరన్న అరనెపిగానె - శిరి
గిరినిలయనెచిరనెఅండవనె - అంసమారుందానెఅయిరిందవగనె - మం
గయార్వాంగనెమల్లికార్జుననె - యానునక్కడియనుసఖలనాయకనె -
యేసవిల్లాదానెయన్నవిల్లియనె - అరనత్తుమువ్వరకాత్మనాయకనె - మ
రునాలుమరియా తెమల్లికార్జుననె - ఆళాలగండనెఆదినుల్లదనె - చూ
ళియేమల్లికార్జుననెయన్నవనె - మెల్లవిల్లాదానెమేగుముళ్లవనె - చొ
ళ్లపుల్లాదానెమల్లికార్జుననె - ఆరుమ్మడింతిరునీరుముళ్లవనె - యేశేరు
మిాశనెమెల్లమల్లయనె - వేదియేదినదిక్కుమాదియేచిపనె - చోదిసె
మల్లికార్జుననెయన్నపనె - అనుచుజంపులునెట్టియాడుచుబాడు - చు
నుసర్వపరసయుత్సుకతనేతేర - నరగవిగొనకిట్టులఖిలదేశముల - పరు
సయునంతటృతభాష బెంపార - ఆయాహిపరిసదాయాహిసఖిత్వ - మా
యాహిసన్మార్గ మతిరక్షసేన - ఆతపక్షాంతాసిహామమరమణి - ప్రతదేవ

హిపురమందీనరాక్షి - దృష్టింవిశిష్టాన్నిధేహివినోద - హృష్టమానా
యపురేహిరంభోరు - శ్రాంతాసికింసఖిశైలతలేషు - శ్రాంతాభవసిపు
రసంవీక్షణేన - జలజాక్షియదిపిపాసాతవభవతి - కలశస్థపాథఃకింపిబ
స్వాదు - ఉత్తంసయాంజలిముద్వీక్ష్యనగర - ముత్తాలఫలసిద్ధిసుపకం
కమేతి - నాథాథవాసీననాథమన్నాథ - నాథమాత్మనిమల్లినాథంభజ
స్వ - అన్యోన్యసల్లాపనాన్యోన్యనంద - నాన్యోన్యకృతివినయామేళనే
న - శుభకరశ్రీశైలచూడాకరాయ - అభవాయశ్రీమల్లికార్జునా
యనమో-కరుణాకరాయశ్రీకంఠాయకర్మ - హరణాయశ్రీమల్లికార్జు
నాయనమొ - అంబకత్రితయాయహరశంకరాయ - సాంబాయశ్రీమ
ల్లికార్జునాయనమొ - అద్యంతవిరహితాయసమశ్చివాయ - ఆద్యాయ
తేమల్లికార్జునాయనమొ - అయురారోగ్యప్రదాయకప్రమథ - నా
యకశ్రీమల్లినాథమాంపాహి - మల్లికామాలికామస్తకాభరణ - మ
ల్లికార్జునదేవమామహిపాహి - మల్లికాఘనసారసుందరదేహ - మ
ల్లికార్జునదేవమామేహిపాహి - మల్లికార్జునయశోమండితాశాంత -
మల్లికార్జునదేవమామేహిపాహి - అనుచుసంతృప్తిభాషనంతంతనె
రవి - యనుషక్తిబాడుచునాడుచునంత - మాళవకాశ్మీరమాగధసింధు
గాళతురుష్క కొంకణశూరసేన - బంగాళకాంభోజపాండ్యఘూర్జరక
ళింగబర్బరసింహళికకరహాట - సౌరాష్ట్రలాటప్రశస్తదేశముల - వా
రాడగాగిబొంపాసుదేశముల - యందునుమధ్యదేశానీకమర్త్య - సందో
హామట్టులనహజభాషలను - మసలివెయొండొరులతోమాటలాడుచును -
పసరించిశిరిగిరిప్రణుతిసేయుచును - జలిదేశపరిచింతుచరితహిళాను - గ
తియుక్తపటనపరాక్రమలిమాదిగాగ - జనుస్వదేశనుదేశసరణివెండియును-
యనుషక్తిబాడుచునాడుచునట్ల - చలగినానాదేశములకప్పడములు -
కలకలంబుగగముల్గట్టియేతేర - నంతనత్యంతసమ్మగతనంత - కాంత
కుంభగుమల్లికార్జునుపురము - కడునొప్పిముందటగానంగనన్యో - నక్ష
రదస్మహిమయేమనిప్రస్తుతింప - గిరిదర్శనముముక్తికినిహేతువనిన -
పురదర్శనఫలమేపోల్కినర్నింప - గిరిసెలయేఱులుసురనదులనిన - పు
రనదీపదముకేపోలికిపర్నింప - గిరిమట్టుమాకులుసురతరులనిన - బు

రయముపవనములేపోల్కి వర్ణింప - గిరిమందరమైయొప్పుచుసురభులంచనిన
బురపశురాశినేపోల్కి వర్ణింప - గిరిసమస్తంబునుహరమూర్తి యనగ -
పురలింగనుహిమమయేపోల్కి వర్ణింప - గిరికిరాతులుముక్తిపురినాథులని
న - పురభక్తవరులనేపోల్కి వర్ణింప - గిరియంత్యజులుధరామరము
ఖ్యులనగ - పురవిప్రవరులనేపోల్కి వర్ణింప - గిరిసర్వజీవులుగీర్వాణు
లనిన - బురజీవకోట్లనేపోల్కి వర్ణింప - నైననెుకించుక నానేర్చుభంగి
పూనుగాబొగడెదమహిమస్మదాది - కవులపాతకులవాక్పావనతరము -
భవత్ప్రణీతకరముపుణ్యసకర్మహారము - ప్రమథమందిరముసద్భక్తభాస్వర
ము - కమలాకరముబాణకములసశ్వరము - భంగురేతరముశ్రీపర్వతు
పురము - లింగమేదురమెున్న లేదలతపము - శుభసముత్కరమువిశ్రుత
తస్వాఖ్యాకరణ - మభినవకైలాసమగుశివపురము - శ్రీశైలవిభుసదాశి
వుమీాదిశీవణ - మాహేశ్వరోమణిమల్లికార్జునస్వామి - దేసిగానిప్పురిది
వ్యలింబు - లానదాశివునినేత్రాదీంద్రియములు - చెనసిదర్శనము త్రి
శిఖరమద్దేవు - ఘనజటాజూటసంగతశిఖరంబు - మల్లికాకుండయామ్యా
జకుండసలిల - వల్లరిశివుమౌళిమల్లికామాల - పరివృతపురవరప్రాకా
రమీాశు - వరమధ్యమేఖలాపలయుభూషణము - భవ్యదతుద్వారభ
రితహస్తమ్ములు - నవ్యవిభూషణనాయకమణులు - భావింపనప్పురి
ప్రభాజనసదులు - దేవదేవేశ్వరుదివ్యాంబరములు - పరుసబురోద్యాన
వనములిశాను - చ ర ణా చ ర్చి త ల తాం త చా రు మం జ రు
లు - ప ర గు ని ప్పు రి వీ ర భ క్త పుం గ వు లు - హ రు
నరకరచరణాద్యంగకములు - భంగిగానప్పురిజంగమవర్య - లంగజహ
రునపరానతారంబు - లటుగూడపరుసయునాపౌరజనులు - బటుగతిశివు
ప్రమోదబసరించుజెనులు - పురిబహురత్నభాసురతోరణములు - కరమొ
ప్పుపురనాథుగ్రైవేయకంబు - లమితతత్పగవరోద్యత్కేతనములు - ప్ర
మథేంద్రులిడుచామరప్రతానములు - గానిట్లుపురముసాక్షాన్ముద్రరూప
మైశివ్వటిలదదీయ్యమహత్వమునరు - నేపారనిట్లొందుహేతుదృష్టాంత
రూపనిరూపణల్ రూపింపనెట్టు - లెగునుకీర్తననేతపలనెట్లుసాంగ - మగు
గగనంగగనాకారమనగ - నెుగిసాగరము సా గ రో ప మం బ న గ -

జగదభినుతలీల శ్రీశైలాధినాథు - పురముపురేశు
నిజోలుగాకనగ - నరుదగు శ్రీమల్లికార్జునపురము - శ్రీకరంబై జగ
త్సేవ్యమైయుట్లు - ప్రాకటంబుగగనిపడుచుయుప్పొంగి - సంతసంబునను
ఘోజయజయయనుచు - నంతనంతయుఁ బ్రీతినప్పారిదరియ - మందిరయుమం
దిరయుమల్లడిగొనగ - గ్రంథునుగ్రంథునుగజబిజింపంగ - బడగలుపడగ
లుముడివడ గ్రాల - గొడుగులుగొడుగులుదొడిదొడినడర - గలయుంగన
డవందిరులునవవంది - రులు మేఘుపజ్తులకుచిదివిబర్వ - విసుకులువిసుకు
లువీష్వడిప్రోడు - మునికులుమునికులుప్రమాన్సితగుల - మదళీలుమ
దళీలుమత్సరింపంగ - సుకృతులుసుకృతులుశ్రుతిగానంవింప - తాళధరుల్తా
ళధరులునుప్పొంగ - తాళముల్ తాళముల్ దండడిగొనగ - గాళులుగాళ
లుగలసి ఘూర్నిల్లి - నాళతుల్ నాళతుల్ నటుదొట్టుపడగ - నటకులు
నటికులునలిరేగియాడ - నటవిలునటవిలునట్టు బన్నుతింప - వాద్యము
ల్వాద్యముల్వానలుదప్ప - పద్యముల్పద్యముల్గద్యలుగాగ - పాటలు
పాటలుపరిపాటిదప్ప - మాటలుమాటలుమందియుణంగ - రసములు
రసములురతులుచలిపఁ - రసికులురసికులునొసగులువీడ - దిట్టలుదిట్ట
లు తెల్లట్లుసెప్ప - దొట్టకుల్ దొట్టకుల్ దొలగిచనంగ - మిండలుమిండలు
మెలతలనరయు - మొండిలుమొండిలుదుండరింపంగ - దాసులుదాసులు
దమకించిపెట్ట - దీనులుదీనులుతిరుగుడువడగ - చూపరుల్ చూపరుల్
సుడివడితిరుగ - తాపసుల్ తాపసుల్ దయలజెనంగ
మోపరుల్ మోపరుల్ ముందరనడవ - కావళ్లు కావళ్లు
క్రంచుకొనంగ - నందలాలందలాలందందపెనగ - మందళ్లుమందళ్లుమల
యుచునడువ - నాయకుల్ నాయకుల్ జాయసేతేర - గాయకుల్ గాయ
కుల్ ఖచరముల్వ్రాక - భట్లునుభట్లునుప్రతిగట్టిపొగడ - గట్లునుమెట్లును
గడువేడ్కజలగ - సేవకుల్ సేవకుల్ చేరికొల్వంగ - భావుకుల్ భావుకుల్
వథమిచ్చినడవ - బాంధవుల్ బాంధవుల్ బ్రతిగాంగలింప - సంధులునంధు
లునటమున్ననడవ - సంగళ్లునంగళ్లునటయిటదనర - సంగళ్లసంగళ్లజను
లేగిపిలుచ - మిన్నేటిజలములుమెత్తనిమణులు - క్రొన్నెలతిలకముల్
గొమరుప్రాయములు - చుక్కలపేరులుసురధేనువులును - చక్కనిమా

పులుసంతానకరులు - నజరామరత్వము లైరావతములు - గజవైరిజన
లుసుగామరూపములు - రవితేజహరులుసురసహాయములును - దివిమె
క్కనిచ్చెనల్ దీర్ఘాయువులును - వెన్నెలప్రాతలువిద్యల్లతలును -
కిన్నరగానముల్ ఖేచరత్వములు - జంగమతరువులుస్వర్గాంగనలును -
సింగంపుకొదమలుసిద్ధమూలికలు - భవహరౌషధములుపండితత్వములు
దివిజేంద్రపదవులుదివ్యదేహమ్ము - లిలగమ్మపసిడియునిత్యఫలములు -
మలయజవృక్షముల్మంచుకొండలును - అష్టాంగయోగములణిమాదు
లైన - యష్టసిద్ధులునుదృష్టాదృష్టసౌఖ్య - ములునేకులున్న లుపులిజ
న్నవిలువ - గలుగుతత్పథమార్గ ములనుసూచుచును - యరిమురదన
రంగనంతఃపురంబు - దరియంగజొచ్చునత్తరిసల్లిగూడ - నడతెంచుప
రుసయునడపందిరులును - గొడుగులుబక్కగలునుడుపేఘదనర - నాలుగు
త్రోవలనలివచ్చుపరుస - నేలయునడవియునింగియుదెసలు - గోపుర
ద్వారముల్ గోటయుగొమ్మ - లాపురంబునుమల్లికార్జునుగుడియు -
మండపంబులునిండ్లు మార్గముల్ నదులు -
గుండములర్వనములుగూడంగమంచి - శ్రీగిరీశ్వరుశిరశ్శేఖరమైన -
యాగంగపరిపూత్నమాగమవేళ - నలరియుప్పొంగిమిన్నందివెల్వెరియు -
పొలుపునబ్బసయప్పరివెల్లివిరియ - గ్రిక్కిరిసెక్కొనిపిక్కటిల్లివిరి -
కుక్కిరింబైకట్టుకొనిగుంపుగూలి - నిట్టద్రోవయలమిట్టమైతూటు - గ
ట్టిసంకీర్ణమైబెట్టుబ్బికూడ - నెక్కడనెక్కడనెంతెంతదెరపి - నక్కడన
క్కడనట్టుగూడనిట్టయు - బండిలమల్లయ్యపదపద్మషట్ప - దుండగుశి
ష్యుండుదోనయ్యగారు - శ్రీపర్వతావాసుశివుభవుజిరద - యాపరు
శ్రీమల్లికార్జునదేవు- దర్శించిహర్షించిభద్రభక్తవరుల - దర్శించి
యద్భుతోత్సవలీలదనర - జంగమారాధనల్ జక్కొల్పినిత్య- లింగార్చన
ములుసల్లీలగావింప- బండకపూవకపత్త్రియుండ - నింజాదుఫలములుని
టలాతుబూన్న - బండొకటీశ్వరార్పణ సేయనుక్క - పండునదన
కగుఫలకోళ్లుమరియు - శ్రీగిరీశ్వరునకంచితరత్నమణిపు - రోగమబ
హువిధారూఢవస్త్రప - తానసమర్పణద్రవ్యమంతయును .. కానుకయు
గునిమిగడుబిత్తమునుచు - ఫలములుపుష్పముల్ ఫలములుగాను . కలు

దర్శనంబులగాంచునంతంత - గంతులునరసిసంగతములు బెరసి - జం
తుపేర్వాడిచెట్టబట్టలబట్టి - కట్టలుగట్టితీగలుసాగియలుక - పట్టులువట్టి
కుప్పలుగొనిగములు - గట్టిపేరెలువారితిట్టలువ్రాది - దట్టంబులైన
నుద్ధతినేగుదెంచి - కూడసప్తార్ణవఘోషణల్ జెలగి - యాడెడిపాడెడి
యలరెడిబృంద - ములవినుకులవేలములసంప్రదాయ - ములకోలుపుల
భోగములవీళ్లవంగ - డములతోయములపండములతో నాట - కముల
మొత్తములబోకలమందిపరచి - యుద్రిక్తమతిశ్రీనగోత్తుంగనిలయ - రు
ద్రునిమల్లికార్జునునిదర్శింప - నలినుబ్బిపౌరగణసహాయులగుచు - గ
లకలాకీర్ణసాగరముత్తరించి - చనువారుదర్శించిచనుదెంచువారు -
జనలేక్కసడుమగ్రచ్చరజిక్కువారు - నోత్రోత్తునకుగాకనోడ్డగిల్వారు -
నెత్తుకొంచునుసముద్వృత్తిజన్ వారు - పత్తిరిపుష్పముల్ బడకుండజేతు
లెత్తుకొనుచునడ్డమేతెంచువారు - పనుసమీదనపడిపడిపోవువారు - చ
రణంబులెడజారిచనిమెడివారు - గీరుసందడిగాంగిలబడువారు - మో
రబల్మిసమునుముట్టజన్వారు - పరుసలపాదముల్బాయంగనడచు - కర
ణిసందడివాయగానడ్చువార - లట్లనవ్వుష్పమాల్యప్రతానమ్ము - లట్ల
గాగై కొనియరిగెడువారు - మహితత్రప్రసాదమంటపద్వార -గహన
ప్రతానముల్గాంచిజన్వారు - తమకించిచొచ్చితత్ప్రసాదమంట - ప
మునందతిరుగుడుపడిలేగువారు - సాత్తమకాక్షింకసొకనాసినుండి - వ
త్తునేయనిపొరుపడిజొచ్చువారు - యిరిసినసందడి దరిస్క్రిందిరిసి - స
రిమురిగర్భగృహముజొచ్చువారు - త్రోచుచు నెరగుచుతొట్రుకొనుచు
ను - బాముచులింగంబుపైబడువారు - పెడవికుల్లగమందిబెనగులాడు
చును - తడబడిలింగంబుదడవెడువారు - తలలులింగముతోడదాకించు
వారు - మలయమలయడుంచుమలసెమవారు - సందడిజొచ్చినసత్తు
మోయనుచు - నంటందలింగంబుహత్తుకొర్వారు - పరుసమెమ్మోయి
సోకబసిడియయనుచు - హరునోకమెయిముట్టియరిగెడివారు - మంటిమి
మల్లయ్యగంటిమిముట్ట - గంటిమేమనుచుచుగ్రమ్మరువారు - వచ్చె
జుమ్మయ్యమావ్రతముమల్లయ్య - నిచ్చుజూచితిమంచునేతెంచువారు -
మల్లయ్యరక్షింపుమాపర్వతంపు - మల్లమీపేరంచుమగుడెడివారు - పై

లికినస్వర్ణపుష్పములుమల్లయ్య - మెలమిగైకొనుమనియే తెంచువా
రు - మెల్లముక్కలుమీను నెక్కజున్మయ్య - మల్లయ్యయంచుగ్ర
మ్మనిదర్శించి - వచ్చువారునుజూచువారునుజూడ - వచ్చువారును
జొచ్చువారువెంజియును - కర్మలుజూచినకర్మంపుదృష్టి - కర్మేతరుని
బాడగాదన్నయట్లు- కన్నులుగలకిచక్కనజూచిక్రొత్త - కన్నులువడసి
లింగముజూచువారు - సమనేత్రగారిదత్స్వామియునింక - సమనేత్ర
మైయున్కి చాతుర్యమనుచు - సమమకానికకన్ను శంభునకిచ్చి - క్ర
మమునసొక్కకకన్నిచ్చువారు - చెన్నుగాహరికిదస్మిన్నిజముద - హ
రన్నేత్రమునగనేత్ర మొకడుబూన్ప- గలిగెదానికిరెట్టిగన్నుజక్రంబు - గ
లిగినట్టులరెండుకనుగవల్ బూన్ప - బూన్చినకన్నుసభుక్తియుముక్తి -
నంచునేత్రద్వయంబర్పించువారు - యింద్రగజాస్యవాగీంద్రాదివాసు
క్రీందకర్ణాంబుజాలునేత్రినేత్రములు - తనువెల్లగూడనేత్రములుగావలదె
యనిసమర్పించునట్లవ్వీరగణము - గన్నులదృష్టిముక్కంటిపైగురియ
సన్నుతిసేయుచుశరణనువారు - కడుబ్రీతిగట్నముల్కానుకలిచ్చి - య
డుగుడుశ్రేమేమునట్లనమగుడ - కడుభక్తినిచ్చినకన్నులుమరల - నడుగు
డుమేయంచునట్లగువారు - పరులగీర్తించుపాపంబునాలుకల - హరు
నిగీర్తించుటన్యాయమన్నట్లు - నాలుకల్ గ్రోసిపినాకిచేగ్రొత్త - నా
లుకల్ వడసివర్ణనసేయువార - లుదరార్థమైచేతులోరుల కెత్తుచును
నుదనారికెత్తుటమార్గమన్నట్లు - చేతులునరికియాశివునిచేగ్రొత్త -
చేతులునమర చెచ్చెరమ్రొక్కువారు - కలలోనజంటిమొగముగానడ
చు - నిలనిచ్చక్రియజన్నులిచ్చెడివారు - తలలేనిశివుడనితలగాని
బ్రతుకు - తలలేదనినమాడ్కితలలిచ్చువారు - గరళాంకుకృపలేనిక
ర్మదేహములు - ధరియించియునికియతప్పన్నయట్లు - చటులసంసార
నిస్సారవిరక్తి - నటుగూడదనువులయర్పించువారు - వృత్రానుజుల
భక్తివిధిధూపదీప - పాత్రలునిజకరపల్లవంబులుగ - పరమేశుమెప్పించి
వడసియుదైత్య - వరులంతబోకపర్వతునిగురించి - ధృతిశిరంబులుధూ
పదీపపాత్రముల - గతిగావహించినకరణియుబోలె - శిరమునదాల్చి
నదిరదీపధూప - పరిమెళప్రభలు శ్రీపర్వతుముంప - జూడచోద్యంబు

చుజూపరుల్వొగడ - నాడుచు బాడుచునలరెడివార - లారంగవెండియు
నలివెలుదారు - వీరరసోద్ధతి వేగంబుదనర - ఘనకీర్తినలకాలగంఢ
పెండెరువు - లునువీరముట్టియలునునందియలును - వ్రేలియాడెడిబలు
వ్రేల్పుబొమ్మలును - గడువడిదెలుపారుగర్ణపత్రములు - నిడుదపా
పెటలునునెరయుచౌళ్లెములు - నిండారుగంధంపు నెరపూతలునున -
ఖండితనేత్రవికస్వరాంశులును - సందడిలోనారసంబులుబట్టి - బొందికోల
లుబనపులుగాటికలును - భసితంపుదిలకముల్ భాసికంబులును - నెన
తోడినడపులువీరవట్టములు - తనరారుపూవులదండలందంద - ఘనత
రంబగుమొలగచ్చకోకలును - గొరిగినగడ్డముల్ గోరమీసములు - మె
రుగుబల్ వరుసయుమిళితమైతనర - దలలమూపులగరతలములవ్రేళ్ల -
గళములజిహ్వలగర్ణరంధ్రముల - గడుపులమెడలవక్షములజెక్కు ల్ల -
తొడలరెప్పలతొడితొడిదీపవితతు - లలరంగ బెనుదివియల నారసములు
గలయంగనిరు మేటిగాడసంధించి - శ్రీపర్వతునకు చెచ్చెరనివాళింప -
దీపవృక్షంబులే తెంచు భావమున - లీలబర్వతునినివాళించునట్లు - గ్రాలు
చుసోలుచుగతినాడువారు - నెలయుచు వెండియునొక్కొక కలన -
ములుసమర్పించుచుముదమందువారు - యేకాంతమునహాటకేశ్వరం
బేగి - యాకాంతుకెలసంబులర్పించువారు - కలయబాతాళగంగా
స్నానవిధుల - నలుపంగనర్థిమైజనుదెంచువారు - ఖ్యాతిమైత్రిపథ
గంగాస్ఫీతమైన - పాతాళగంగాప్రభావమెట్లనిన - యురగాంకుశ్రీచ
రణోద్భూతయగుచు - బరగుభోగావతిపాతాళమునను - భవనము
ద్ధూళితభస్మసంజనిత - యవుచుభాగీరథియమరుమర్త్యమున - కర
కంఠవరజటోత్కరజాతయగుచు - వరలుమందాకినిస్వర్గలోకమున్న
థరస్వర్గమర్త్యపాతాళగంగాప్ర - సరసంగమంబు శ్రీశైలచూడమ
న - ప్రకటితంబగుమన్కి బాతాళగంగ - సకలదీర్ఘఫలప్రసారితమ
హిమ - దావెలుంగుచునిజదర్శనస్పర్శ - నావగాహాభరణాదులవల
న - సాలోక్యసామీప్యసారూప్యముక్తు - లోలిగజాలుమహోర్మిదో
ర్లతిక - ననిమిషజనలోచనావర్తనాభి - ఘనతరపులినజఘనకమలా
స్య - యుఘురథాంగస్తనయుగఫేనహార - వరహంసగమనప్రవాహాంగ

యగుచు - కారండహంసబకక్రౌంచవిపుల - సారసకుక్కుటచక్రవాకాది జలపక్షిరవవాద్యచక్రముల్ మ్రోయ - నలిమృదురీతినాదారవ మొసగ నలిబరిమళోత్కటివనజ తేరగాంచి - పాలయుపీచులుహస్తములుగానటించు భంగిబాల్వారునుత్తుంగతరంగ - రంగిణిబాతాళగంగదర్శించి - తగయ థాసంభవదానధర్మంబు - లొగినినియోగించిపుణ్యోపేతులగుచు - నరిగి శ్రీరుద్రపాదాభివందనము - గరమర్థిజేసియాకర్మారినుగను - నన ఘులభవపరిత్యక్తమానసులగనుగొంచునచ్ఛతాక్రాంతాత్ములగుచు - న రిమురినవలికర్మారీశ్వరమున - నురుకుపుణ్యులజూచియొగినుతించుచును పాపకంటకవనోత్పాటనయశుల - పాపవినాశనప్రభృతిలింగముల - నంతం తదర్శించియంతనప్పరుస - యెంతయునాశ్చర్యహృదయులైపొదలు - శిరిగిరినిట్టివిచిత్రంబుగలదె - పరుసయిత్తరిగుడ్డపరుపంగరాదు - రెయ క్కొక్కలకుకునెక్కొకడురుకు - నక్కజంబైనకర్మారీశ్వరమున - ను న్యుక్తివింటివాడుడునీధినేయ - నాద్యంతమద్యబాణాటనంబట్ల - పక్షి యెడిదేహంబుపడినదేహంబు - నక్షిమిదేహంబులెన్నంగబెక్కాడు - చుండెనద్దినములయుడుగకననిన - వెండితీర్థావళుల్ విరచింపదరమె వరభక్తియుక్తిశ్రీవారణాసికిని - కరమర్థిజనుసాతుకరణిజూచితిమి - క్రీతిదాక్షారామభీమేశుపెండ్లి - కేతెంచుపరుసనాజేముసూచితిమి - గు డిపూడిసోమేశుకూర్మిపెండ్లికిని - నడతెంచుపరుసలనాడుజూచితిమి - పెనుమెట్లపులియూరిపెండ్లిండ్లకర్థి - జనుదెంచుదర్శించుసాతుజూచి తిమి - చిరతరభక్తిమైశిద్ధవటంబు - తిరునాళ్లకేతెంచుపరుసజూచితిమి గుడ్డవ్యపురమునరునుజాత్రవచ్చు - దొడ్డనందడినాడులోలుతజూచితిమి విజయాపురంబునవీరసోమన్న - భజయింపజనుదెంచుపరుసజూచితిమి సరిజేర్చుక్షేత్రపూజలకుసాన్నలిగ - పురమునకేతెంచుపరుసజూచితి మి - సౌరాష్ట్రనాథునిజీరగట్టించు - వారంబులకువచ్చువారిజూచితిమి ఆదటసింహబృహస్పతిబరుస - గోదావరినిగూడుకొలదిసూచితిమి - మహినివృత్తినిరవిగ్రహణాదులందు - బహుళంబుగాగూడుబరుసజూచి తిమి - నలిగార్తికంపుపున్నమనాటిపరుస - కలిమియుద్రిపురాంతకము నజూచితిమి - [illegible] నబలుమా

రుసంఘముగాని - అట్టిపెన్ సందళ్లనంతంబుగాంతు - మిట్టిసందడిగాం
తుమేయన్లుగాక - మరియొక్కచోద్యమీమల్లికార్జునుడ - మెరుగు
దానెట్లన్న నేమనిచెప్ప - నెంతెంతపరుసదానే తెంచివిడ్డియు - నంతంత
నాయతింబయ్యెంబురము - యెంతెంతబరుసదానే తెంచికోరు - నం
తంతజలపూర్ణమయ్యెండునదులు - నెంతంతబరుసదానే తెంచిచొచ్చు
నంతంతవిస్తీర్ణమగుశివాలయము - లెంతంతబరుసదానే తెంచికాంచు
నంతంతయున్నతంబగులింగమూర్తి - లక్షింపగసపాదలక్షనేపాళ -
మీక్షింపగసపాదలక్షసంజనిత - లక్షింపగసపాదలక్షగౌడార - మీ
క్షింపగసపాదలక్షదిర్హాలి - లక్షింపగసపాదలక్షగాశ్మీర- మీక్షిం
పగసపాదలక్షకన్నోజ - లక్షింపగసపాదలక్షకొంకణము - వీక్షింపశిర
హట్టమిలసప్తలక్ష-క్రమమొందసాళ్వాధరంబదిలక్ష- ప్రమితియౌదశల
క్షబంగాళభూమి-గురిసప్తతిసహస్రగుజరాష్ట్రభూమి - పరియటదశల
క్షమాళవభూమి - జానొందసివలిపంచద్రావిళములు - తానవలక్షతె
లుంగుదీనికినీ - యిమ్మహిమున్మడియితరదేశములు - నిమ్మహిదేశంబు
లెన్నంగనేల - ధరమూపుననుంచు కేదారనగంబు - పరగుద్వారావ
తిశ్చిమంబునను - వరుసనుత్తరమునవాలుకానదియు - దరమిదిగంధ
మాదనమునుయామ్యమున - రతినసంతంబుత్తరాపథంబనగ - క్షితిహిమ
వంతంబుసీమగామరియు - నెన్నంగదేశంబులెన్నిమెన్నియును - మె
న్నంగమోక్షార్థులెందరందరును - కడునొప్పదక్షిణకైలాసమనగ -
బహుగానయిట్టిశ్రీపర్వతాధీశు - వారకదర్శింపవచ్చినయపుడ - పౌ
రులవర్తింపబడసినయపుడ - తానెక్కకొలదినైదసరునిన్నియును
మానుగాజర్వతుమహిమయెట్టిదిరొ - యొగియెట్టువోయదమోయను
చుండి - యొగివచ్చితిమికులంబుద్ధరించితిమి - మంటిమిశిరిగిరిమల్లయ్య
జూడ - గంటిమికష్టముల్ గడచితిమింక - బుట్టుగుసఫలతబొందెగర్మ
ములు - చెట్టులనటమున్న కట్టివచ్చితిమి - పేళ్లిడగంటిమిబిడ్డలదొల్లి -
యూళ్లప్రమొక్కినప్రమొక్కులాగిబూరగించె - మదిలోనశివయనిమము
మేమెరింగి - నడియాడిగాగబోయదముపోయదము - శిరిగిరికనుచుండ
సిద్ధించెనిపుడు - ధరనెట్టకేలకుదమభాగ్యమహిమ - నగునగునిట్టిపుణ్యా

క్షేత్రమనగ - దిగవిడ్చిపోవనముగుడియూళ్లకును - యేటికిన్నియులిం
గముగుచోయింత - నేటికిసంసారమేటిజీవనము - యియ్యనూభక్తివి
హీనులబ్రతుకు - కొయ్యబొడ్వనెవానిగొంపోయికాల్వ - తల్లులుదం
డ్రులుతనయులాత్మజులు - మొల్లంబుధనములుమునుమునుభూము -
లూళ్లున్వృత్తులుఖనియోగసౌఖ్యములు - భేళ్లునుబెంపులుబెద్దరికములు
బలపరాక్రమములుబ్రాణముల్ రాజ్య - ములుసంపదలువంశములునటు
గూడ - జలబుద్బుదంబులుశారదాభ్రములు - జలతరంగములింద్రచాప
ముల్ నిట్ట - పాటులుబయలిదీపములుబాలకుల - మాటల్ పిపీలికామా
గంబులెండ - మావులుమెరియలుమహిమలుమెరుగు - దీవెల్ గతాగ
తద్విరదకర్ణములు- వానవఱ్ఱులునీటివ్రాతలుగాక - తానిత్యములేమా
యదగునెజ్ఞానికిని - యనుచుదల్ క్షేత్రసమగ్రమహత్వ- మునజేసివైరా
గ్యమునుమదిబాదల - వచ్చువారునుజొచ్చువారునువెనక - వచ్చువా
రునుజూచువారునైయుండ- నారూఢమతిమల్లికార్జునపండి-తారాధ్య
సుతుడుదోనయ్యసంప్రీతి - నాగమోక్తముగభక్తాలియుదాను - జాగ
తణోద్యుక్తసంగతబుద్ధి - మానితప్రాసాదమంటపగోపు - రానీకవప్ర
వరాభ్యంతరమున - విలసితవివిధనవీనాంబరప్ర - కలితమంటపమొ
ప్పుగావించియందు - పరిచిత్రక్రమమురంభాస్తంభముకుర - భరితోత్త
రంగకుంభద్వారతతుల - లంభితపుష్పమాలాకుట్టిమముల - నంబు
జోత్పలసమాయతతోరణముల - కంబకట్లునుమేలుకట్లుసమంచి - తం
బులైయొప్పనూతనఫలావళులు - నుపఫలావలులుబుష్పోపమాలికలు
నుపసద్మముకురములుపరత్నములును - మానితబహువర్ణమహితో
పహార్థ - ఫేనపుంజంబులుపృథుతరంగములు - కమనీయ్యనిజరత్న
ఖండుకావలులు - నమితసువర్ణలతాంతమంజరులు - పరిచిత్రద్రాక్షాది
ఫలగుచ్ఛములును- గుకతరద్రుమాంకురలతానళులు - భర్మాంబురం
జితపటుచిత్రవస్త్ర - నిర్మితబహుపక్షినివహాతిశయము - పక్వాన్న
వలయముల్ పక్వాన్నతతులు - పక్వాన్నపూరముల్పటుకమలమ్ము -
లరుణాబ్జకర్ణికలాశోకరక్త - కరవీరచంపకకైరవాద్యఖల - సురుచిర
ప్రసవవిస్రుతసుహిమాంబ్రవ - కరబంధతత్పుష్పఘుంటికావలులు - నెంత

యనింపువహింపగన్పింప - నంతసద్భక్తమహాత్వంబుసూచి - యిలఁది
నాహాంతిబహిస్తమోయనగ- వెలిచీఁకటిమయ్యాహ్వా వేళనకాని - చెన
దునారశ్మలచేతశ్రీగిరికి - నడినవభక్తదర్శనమాత్రవేగ - మైబహి
రంతర్దివానిశంబనగ - పైబడిరాతిరెపగలింటిలోన - వెలితమంబంత
యువేగంబగ్రాగు - నిలనింకదన్రబతుకేటికటంచు - గడుగడులజ్జించిగడక
వారాశి - బడినభావంబనభానుండుగ్రుంకె - మానుగాసూర్యాస్తమా
నంబుజెప్పి - జానెందనారాత్రిసంస్తుతిసేత - దానవశ్యముకవితాధర్మ
మునకు - నేనింకనీరాత్రినెట్లువర్ణింతు - పృథులకాహాళశంఖభేరీర
వంబు - ప్రథితమృదంగాదిబహుఘోషణంబు - కాంస్యతాళానేకఘం
టికాతిప్ర - శంస్యోర్ధ్వరావంబుజయజయధ్వనులు - నలరుసంధ్యావేళ
యందందమేని - నిలవాద్యరవమతానేప్రొద్దుగూడ - గర్జిల్లునవ్వాశ
ఘనఘనాటోప - గర్జనగతిగిరుల్గర్జిల్లుచుండ- వారకచీకటివర్ణిం
తమంద - మారాదుతద్దీపమాలికాతతులు - ప్రాసాదగోపురబహు
హేమకలశ - భాసురద్యుతులుశుంభద్ధ్వజదండ - ఖచితభాస్వద్రత్నక
లితదీధితులు - ప్రచురప్రభలపేర్మిరాత్రిబవళ్లు - తెరగులవెలుగారతి
మిరమప్పురిని - నెరినెన్నడును లేదునేఁడేలచెప్ప - సరిజారచోరులచర్చిం
తమేని - చరితార్థవంతులుశైలాగ్రచారు - లుడుపఙ్క్తివర్ణింపసూ
హింతమేని - యుడుపతిగనికదాయుడునభోవీధి - పటుతరపురసముద్భట
ధూపధూమ్ర - పటలంబునీలాభ్రపటలమైయునికి - జలజోత్పలావిక
స్వరవికస్వరత - లలవడవర్ణింతమంద మేనియును - భాసురాగ్రంకష
పర్వతోన్నతిక - నాసూర్యచంద్రోదయాస్తమానములు - గొలకుల
కలువలకునుదామరలకు - నలినహానిశముగానంగరాకునికి - నప్పా
టవర్ణించుటవివేకమట్లు - చెప్పజిత్రంబగుశివరాత్రిమహిమ - రమ్ము
కృమృగవ్యాధుడురుకాననమున - గ్రక్కుననొక్కమృగంబునీక్షించి -
శరమరివోసిభాస్వద్దృష్టిముష్టి - సరససంధానకౌశలముపట్టిల్ల - తొల
గియేయుడుగోలతోడనమిట్టి - పడనామృగమునుచ్చిపాఱితప్పనము
చకట నవిమ్ము భూ స్థలినతినిద్ర నక్కొన్నకోల్పులి నెత్తిపైబడుడు
ఛిట్టులిక్కపడినదరిప్పితోగ్రమ్మతి - గట్టురగట్టిన్వాయుంబునీసుంబ - పై

జడనతిభయభ్రాంతినవ్యేరుక - వేఁపారియొకబిల్వవృక్షమెక్కఁడును - ద
లచుట్టుబెనురక్తధారలుబర్వ - బులినొచ్చివచ్చియాఘోరుహాగ్రమున -
నున్నలుబ్ధకుగనియునుకోపవహ్ని - గన్నులగ్రమ్మనుత్కటధూమలతతు
లు - ముక్కునవెడలసముద్ధతిప్పక్షు - మెక్కఁజూచుచుశాఖలిసగమించు
చును - యరిమురినోచుచునరచుచుగరచి - కరబిన్నైచుచుపుండ్లుకర
చుచుచుట్టు - చుట్టినచ్చుచుమూల్గుచునునొరలుచును - బిట్టుప్పళించుచు
బిల్వవృక్షంబు - తోవాలమడచుచుతొట్రుటుకొల్పుచును - పోవకని
మ్మానిక్కఁవులియున్కిఁగలగి - తానెక్కఁవచ్చునేధరనెట్టిపులికి - నైనవృ
క్షాగ్రంబుననకవ్యాధుండు - ప్రాణభయంబునభ్రమసియాత్మీయ్య - బా
ణపాతోపపాపముననిమ్మృగము - మెట్టునుబోబోలదెసురుద్రమానెక్కు -
బట్టిజంపునెగురుభంగించునెంచు - నంచుదదీయ్యబిల్వవనీరుహాస -
మంచితస్కంధంబుహరమూర్తిగాగ - బులికిజిక్కితినినిపొగులుదచ్చోక
జలములునవియమజ్జనజలములగ - మరులైనబత్తిరిమహిద్రుంచివైవ
దరితరినదినిరంతరపూజనముగ - భువిజట్టుముట్టెడిపులియట్లతిరుగ - న
వియనవ్యాపసవ్యములుగావిాద - నాహారమాతిథియందులేకునికి - నూ
హింపనదియతానుపవాసముగను - పనుగొనమృగముదప్పకజూచిచూ
చి - కనుమూయకునికినిక్కఁవుజాగరముగ - బులియునుజంపకపోనని
యుండ - బులికోడియాతఁడుబోవరాకుండ - తవిలియకామకృతమునదెం
చునకు - శివరాత్రియుదియట్లచెల్లెజాగరము - కందర్పహరుడిట్లుగైకో
నియెనుకు - బ్రొందితోడనగొనిపొమెగావునను - యెల్లరాత్రులయట్టు
లేశివరాత్రి - చెల్లునేకవితాపశేషతబాగడ - శివరాత్రినుహిమయాశివు
డొగుత్తెరుగు - దవిలియట్లొప్పసంధ్యాకాలమునను - యత్యర్థిప్రణుత
సంధ్యముడుదోనయ్యు - నిత్యలింగార్చననియమముల్ దీర్చి - శ్రీ
లింగచక్రవర్తినిభక్తిసత్రిక్కి - యాలోలుఁశ్రీమల్లికార్జునదేవు - సం
ధ్యాయుతాంభోదనర్తనసజూటు - సంధ్యోచితార్చనాసంతుష్టుజేసి -
యంతతదీయ్యనితాంతోపమంట - పాంతరంబునబురాభ్యంతరంబునబు -
రాంతరదేవాలయాంతరంబునబు - రాంతికోద్యానవనాంతరంబులను - ఖా
స్వరసద్భక్తి [illegible] - సుఖిత

తగోపురచూడాగృహములు - శిఖరిశృంగాదిప్రసిద్ధశృంగములు - రమణ
సారంగేశ్వరముహాటకేశ్వ - రమును బాపవినాశనముగిన్న రేశ్వ - రము
ను వారాహేశ్వరమును సిద్ధేశ్వ - రమునాదియగునీశ్వరస్థానములును -
నల్లలితములుగా నలయమిప్పించి - పెల్లుగా ముగ్గులు బెట్టంగ బంచి - వి
విత లింగార్చనా వేదికాస్థలుల - బదపడి బిందియల్ పడిగంబులర్ఘ్య - పా
త్రలునూతనభాండముల్ వంశ - పాత్రలు ఘంటలు బహుధూపదీప - పా
త్రలు బహుహేమ పాత్రలు రజత - పాత్రముల్ వ్రేడముల్ ఫలములు ఖర్జ
ములు సుగంధద్రవ్యములు ముఖ్యపుష్ప - ములు మాలికానీకములు ఖండబి
ల్వ - పత్త్రిరిసూవులు బంచామృతములు - నుత్తమాక్షతలు దివ్యాన్న
నావలులు - నతిసుగంధంపుదశాంగమానంగ - వతియుసురభియునాగ
ర్ఘధూపంబు - మలయానిలంబును మహిసాక్షి మడ్డి - కలహంసధూపం
బుగామికామోద - మునుమనోహరధూపమునుదివ్యధూప - మునుబ
నవల్లభామోదధూపంబు - లాదిగాధూపంబులానందవర్తు - లాదిగావ
ర్తుల్ గృహాంగవస్త్రాది - వాసనాదులుగూడనరభక్తతతికి - దాసత్వ
మతినర్పితముజేసిమరియు - నేవస్తువులు ప్రియంబెప్పుడువలయు - నావే
శవారికినభిమతార్పణము - సేయుచునిబ్బంగిశివరాత్రిపర్వ - మూర్జి
తంబుగసల్పనంతభక్తులును - కలపంబుపన్నీరుకస్తూరిసాదు - నలిగూ
ర్చి సంమార్జనము సేయువారు - తళుకులు బత్రముల్ కమలముల్ బంధ
ములు ముకుళంబులు ముత్తియంబులును - నిగ్గారుబంచవన్నియల ముగ్గు
బును - ముగ్గులత్యాశ్చర్యముగ బెట్టువారు - తలకొని సంతతధారాసహస్ర
కలశాభిషేకముల్ గావించువారు - శిష్టాగమోక్తవిశేషతనలరి - యష్ట
విధార్చనంబులవర్చువారు - నలినుబ్బిభక్తగణప్రకరంబు - దలచుచు
ధూపాపీతముసేయువారు - మంగళంబగుభక్తమండలికనుచు - రంగ
త్కర్పూరముల నారతులెత్తువారు - నంచితభక్తిహితార్థకల్పనల - బంచ
భక్ష్యాదులర్పణసేయువారు - కర్పూరసహితంబుగావిడియంబు - ల
ర్పించువారునొంపారంగనిట్లు - నాల్గవసరములనలిశివరాత్రి - నాల్గుజా
ములునుసన్నుతిజేయువారు - ప్రేమతోనాపగల్ రేయునుజాము - జాము
నకర్చనల్ సల్పెడివారు - ఘటికలర్ధదియునుగలయు జెన్నలయ - ఘ

టికావసరములు గల్పించువారు - సముచితాష్టోత్తరశతసంఖ్యనవస -
రములుసంకల్పించిరతి జేయువారు - సష్టోత్తరసహస్రసమవసరంబులువి
శిష్టతమైయట్లుచెల్లించువారు - తరిబూన్పుపూజయుదరముపూజయును
వరలబూన్పగనలవరచుపూజయును - గాననితరపరికల్పితార్చనలు -
నానందలీలబాయకసేయువారు - రతిషోడశోపచారక్రియార్చనలు -
నతిభక్తితోడబాయకసేయువారు- నాదిఋగ్వేదాదినలరారుసూక్తు -
లాదిగాతద్బ్రాహ్మణాంత్యసూక్తములు - తుదియుగారుద్రసంస్తోత్రసూ
క్తములు - జదువుచుబొదలిప్రశంసించువారు - రుద్రవిధాననిరూపిత
న్యాస - భద్రాత్మకాఘ్యర్ఘముల్ పదనకొంటికిని - క్రమమొందజమక
సూత్రంబులేకాద- శములునెండొంటికిశాంతులుగాగ - దివిరిఛందో
రుద్రదేవతాశక్తు - లవిగూర్చిబీజాక్షరాన్వితముగను - స్రదతిశ్రీశ
తరుద్రంబుగూర్చి - రుద్రంబునందపురుషసూక్తములును- యాయజు
ర్వేదవేదాంతసూక్తములు - బాయకజదువుచుబ్రణుతించువారు - సా
మంబుదవ్వేదసామరహస్య - సామాదులగుననసామాదులందు - జను
నీశ్వరప్రశంసావరసూక్తు - లనుపక్తిజదువుచునంకించువారు - ప్రవి
మలాథర్వశిరశ్శిఖాదులను - తవిలిశ్రీపాశుపతవ్రతపరదు - శ్రీరు
ద్రుమహిమయచెప్పుసూక్తములు - వారకచదువుచువర్ణించువారు -
నంచితభాణగద్యాక్షరగద్య - పంచగద్యాదులుబహుగణాడంబ - రం
బుగణాడంబరంబువ్యాసాష్ట - కంబును శ్రీనీలకంఠస్తవంబు - శ్రీరు
ద్రకవచంబుశారభంబును మ - యూరస్తవము హాలాయు
ధను నామయుము - మలహాణంబునుమహిమ్నంబనుస్తవము - మ
లయరాజీయంబుమానిదండకము - శ్రుతిమూలమగుమహాస్తోత్రసూక్త
ములు - శతకముశివతత్వసారముదీప - కళికమహానాటకమునుదాహ
రణ - ములురుద్రమహిమయముక్తావలులు - గీతసూక్తములుభృం
గిస్తవంబునుబు - రాతనమునుముఖ్యరచితాష్టకములు - హరలీలరు
ద్రసహస్రనామాదు - లరుదొందజదువుచునంకించువారు - నరుదగు
దాసయ్యయరవత్తుమువుర - చరితంబులను శ్రీబసవపురాణంబు - లే
లలువెట్టంగనింపుసొంపారు - శైలిమ్మైగాలుచుజదివెడివారు - చాతు

ర్యమనగ బసవదండనాథు - గీతంబులాదిగా గీతాధ్యులైన - సకలపు
రాతనచారుగీతములు - ప్రకటించి ప్రకటించి పాడెడివారు - చదువులపా
టలసంగతి లేమి - బాదలి మాటలయందు బాగడెడివారు - నాహూళులకు
మనంబందమి మల్ల - యామల్లయామల్లయాయనువారు - జయజయ
జయయుఘోషజయజయయనుచు - జయవెట్టి మ్రొక్కుచు సరిబేర్చువాత
లలరుచు ఫణిహారులట్ల నందరును - లలినుబ్బి చాంగుభళాయనువారు
దనరుశబ్దముగ గద్గదంబున వెడలు - చుసికి దప్పక చూచుచుండెడివారు -
చూపుల శివసుఖాశ్రులు వెల్లిముంప - నాపోవ శౌగయుచు నాడెడివారు
నగయంగ నగయంగ నెంతయు గాఢు - లెగయక సన్నెక్కి యిలఁ ద్రావాలు
వార - లాటలాత్మీయ్య సర్వాంగవిస్మరణ - పాటిదప్పిన జొక్కిపడియెడి
వారు - చప్పటులొ్వట్టంగ జక్కనలేచి - యప్పాటవెస పాటలాడెడివారు
ప్రమథపురాతనపటుచరిత్రములు - గ్రమమొంద బహునాటకములాడు
వారు - లలితాంగరసకళాలంకారరేఖ - లలవడ బహురూపమాడెడి
వారు - కరణముల్మెరలు గతులు జిత్రములు - నరుదుగ వెడ్డాగ మాడెడివా
రు - నమరాంగనలు దివినాడెడు భంగి - నమరంగ గడలపై నాడెడువార
లావియద్గతి బత్తులాడెడియట్టి - భావనమోకులపై నాడువారు - భార
తాదికథలు బరతేరమునగు - లారంగ బొమ్మలనాడించువారు - కడున
ద్భుతంబుగ గంబసూత్రంబు - లడరంగ బొమ్మలనాడించువార - లాడట
గంధర్వయక్షవిద్యాధ - రాదులై పాడెడియాడెడివారు - విధమున బ్ర
చ్ఛన్న వేషముల్ దాల్చి - యధికోత్సవముదులుకాడునట్లాడ - శిరము
నగరమున జెవులగంఠమున - గరమునగూకటగాళ్ల జెమర్ప - గవడదం
డలుగను గవగరణికలు - జవరంబులునుగలశములదండములు - భసితంపు
పూతపైబరగుబచ్చనలు - నసలారజిరుగజ్జియలు నందియలును - సరిరత్న
పంక్తులజలపోసనములు - గరమొప్పతోంగల్లుగలకచ్చడములు - బొలుచు
దంతావళుల్ బుష్పమాలికలు - దాల్చియత్యద్భుతోత్సవలీలదనర - జను
ఖుహాషికాంపనాస్థానముల్ సొచ్చి - యనుకూలవివిధవాద్యపుమేళవము
ల - నాభటాటంబెచ్చియొయ్యనజవనికల - గర్భంబులెనలియక్కజ
పుసప్రట్లిల్ల [illegible] కసుండెడటో

ద్యంబుడపర - నిక్కుచుఁద్రిభంగినిల్చుచుసల్ల - సొక్కుచుసభఁజూచి
యొక్కింతనగుచు - నలినంగసంచలనమునందగతుల - లలిఁగొనఁద్రిపోల
తలనునర్తనసంబు - మొనయుజిత్తోల్లాసముననురంజనత - దనరకటా
క్షంబునసకలశంబు - లలరిశిరఃకంపమాచరింపుచును - నలినంగవిస్ఫో
టసంబునీయుచును - లాగుపెంఝుళముతాళమువళితిరుగు - బాగువా
హినిచాళపయగతసుగతి - బహుగతినాజరిపాటినలసర - సహజ
స్థితనుగతి స్వరపంచకములు - బటురసాలంకార భావములమర -
స్ఫుటవాద్యతాళసంఘటనఘటిల్ల - ఘనపాదఘట్టనదనరునుద్ఘటన - ల
సునయించుచునందియలుగదల్చుచును - యోహాహాయనుచుగతులొ
డ్డగించుచును - యూహాయనుచులాస్యమునునయించుచును - జతులు
పాడుచుదాళగతులకాడుచును - శ్రుతులుగూడుచుసేలద్రొక్కనోడు
చును - వీగుచుగరణికవిస్తరింపుచును - లోగుచుదంతావళులునటింపు
చును - బొబ్బలిడుచుబొంగియాచుచును - గుబ్బణగేసుచుగుని
సిలేచుచును - జారుచుజంగలుసాచుచుమంది - నూరించుచునుమొగం
భోరుపుచ్చుచును - చంకజూపుచుబయల్ జప్పరింపుచును - చంకలడ
చికొంచుశంకరుబాగడు - చునునుర్కుచునుగెలిచూచుచుజన్ని - కొ
నుచుగంతులువేయుచునుమనికట్లు - వెకమరించుచుఁవేళ్లువిరికిలించుచు
ను - రొమ్ములడంచుచునురంబాగ్గుచునీవు - పొరడువుచ్చుచుభుజంబులు
బలియుచును - కరములాచుచుజెవ్వుల్గత్తురించుచును - మోకాళ్లుదా
డలునుముడివచుకొనుచు - గూకటిగిలువుచుగొక్కరించుచును - మూ
తులునురువుచుముక్కటించుచును - మోతకునుబ్బుచుమురియుచుజను
చు - మిన్నకసూచుచుమెడవిచుకొనుచు - కన్నులాచుచుజెవ్వుల్గ
త్తురించుచును - వెవ్వెరలాడుచువెక్కరించుచును - గవ్వదండలయం
దుగతులువుచ్చుచును - బొమలెత్తివైచుచుబుగ్గరించుచును - తమకించి
దాటుచుదండయిచ్చుచును - కొంకుచువణకుచుకొసరుచుమూను - వం
కలువోవుచునంకించికొనుచు - బరులచేవేయుచుబకపకనగుచు - గర
ముబ్బుచుదృష్టిగారించికొనుచు - సరసంబులాడుచుజప్పటులిడుచు
విరసంబులాడుచు [illegible] [illegible] చును -

అడ్డంబుద్రికటంబునన్ని పారుచును - మరగాలనడచుచుమట్టగాలగుచు
నోరిగాలనడచుచుధరగంతుగొనుచు - మోకాళ్లనడచుచు మొగిగాళ్లు
నేల - దాకుచుండగ నెగ్సితటుకునజనుచు - గూచుండినడచుచుగుం
పించియుచట - నాచుచుమెరములందంద వైచుచును - యురమునడం
చుచునొదికిలిచనుచు - ధరబారలుచుసముద్ధతిలేచిజనుచు - నుర్వీద్రి
పృటమునట్లొక వేలయిడియు - గుర్వాగ్రాద్రిప్పాచుగుంపించిజనుచు - కర
తలంబూనిశీఘ్రమనారియట్లు - ధరదిరుగుచుదిశల్ దన్ని నిల్చుచును -
ధరబొమ్మరమునట్లుదలక్రిందు లేచి- తిరుగుచుదివిదన్ని దివుటనిల్చుచును
నమలియుబోలెనున్న తినటించుచును - భ్రమరంబుగ్రియరాగపరిఘటిం
చుచును - చిలుకయుబోలెచెన్నులయబల్కుచును - జలచరంబునుబో
లెజనులకుల్కుచును -కలహంసయునుబోలెగతులనేచుచును - యిల
మృగములయట్లులిరమిజూచుచును - గండుకోయిలబోలెగణగికూయుచు
ను- వెండికోతియుబోలెవికృతిసేయుచును - యాలశేడునుబోలెనటయిట
జనుచు- కోలకాడునుబోలెకూర్మెనగొనుచు - మదగజంబునుబోలెమా
ర్మలయుచును - పొదలి యుష్ట్రంబట్ల బొరినురి యుచును - కేసరివ్రా
లెలంఘించిబట్టుచును - మాసటీడునుబోలె మండివెట్టుచును - మహి
భుజంగముపోలెమలకలుగొనుచు - విహగంబుక్రియనభోవీధులజనుచు
సరివిలాసినివోలెసభలమురియుచును - వరవిటునట్లభావములరయుచును
కవియట్లనపరసగ్రాహకులగుచు -శివయోగియట్లతాచిరునవ్వునగుచుప
గలేనివిభునట్లపరిణమింపుచును - పొగలేనియగ్నియుబోలెవెలుంచుచును
చాయలేనివెలుంగుచాయగప్పుచును - మా యి కు ని వ లె ను
మాయజేయుచును - పు ర ము లు గా ల్చి న పొ ల్కి యా
డుచును- మరుజరబుచ్చినమాడ్కియాడుచును- సతికర్ధమిచ్చినచంద
మాడుచును-యతులుగొల్వగనున్న యందమాడుచును- అంధకాసురమ
దమడచుటాడుచును-గంధగజాసురుగడచిడాచుచును - జన్నంబుద్రుంచి
నచాలిథియాడుచును - వెన్నునికన్నిచ్చువేళయాడుచును - గరళం
బుదాల్చినకరణియాడుచును - సరినజుతలగొన్న సమతనాడుచును -
నైండ్లియుభవుబహు విధచరిత్రముల - ఖండితమతినాటకంబులాడుచును

భృంగియునభిమతశ్రీతిమత్యర్ణంబు - భృంగులలోఁ జానభృంగిపైయాడ వీణోత్తమములుబ్రహ్మవీణకైలాస - వీణయుసారంగవీణయుగూర్మ - వీ ణయునాకాశవీణయుమార్గ - వీణయురావణవీణయుగౌరి - వీణయు నంబికావీణయుబాణ - వీణయుగాస్యవీణస్వయంభు - వీణయునుభు జంగవీణయుభోజ - వీణయుగిన్నరవీణయురుద్రసరి - వీణసరస్వతీవీణయు మొల్లి - వీణమనోహరధవీణయుసరధి - గణనాధవీణయుగౌమారివీణ - యుణివాణితానణహస్తంబుదవిరి - చకనయువధికచిత్రికనటనాగ - ఠక యుగుంభికపంచికసరవీణ - పరివాదవీణమల్లరియకుల్లాప్తి - స్వరమండ లంబుఘోషావలియునవి - ధంబునౌవుంబౌతంత్రిసాగరము - సంబుజవీ ణయునాదిగాఘురియు - నమురంగగీతానుగమనుభయాను - గమురణివీ ణానుగమున్శ్రుతానుగము - లనులతకణోక్తములగుచుబ్రమాణ - విని యోగమగుతంతువునుకణికలును - చెలువారువంశియజంత్రంబుమృదు వు - లలియుమాధుర్యంబులసనంబునులయు - సయతాణమును మొగసా ళంబునుకళ - యుయతాణమునుగర హరణసారణము - పొట్టవణిగతి రుఫునుపత్తితాళ - వట్టికర్తరియునేర్పరిజన్యజనక - విరచనల్దలుకొ త్తవీణానులైన - నరులలోఁగలశికిన్నరులువాయింప - నచ్చగాముసుర వణాగముల్మెరసి - మెచ్చులుబడయుచుమృదుమ్రోలమరియు - ము దముసహస్తమును బైసరంబు-పదమునంతరమును బారణవర్తుల-కలి తంబుజతియుదక్కరమురచ్యంబు- మలపంబుముఖవాద్యమిలబల్లణంబుబో ల్లానణియుమలఁపునువిమర్హణము- యుల్లంఘియునుఘాతయుత్రోళవిష ము-వాణియునర్ధార్ధవాణియునర్ధ-వాణియుదాళకుంభవణియుద్దండ హస్తజావాణిసమగ్రయుబిండ - హస్తచంద్రాణియు నవజతిపంచ - హస్తశివోదధియంతరాయుపరి- హస్తపయశ్చేదియాస్థానగర్భ- జతిబొజ్జ జలపాణిసమపాణిభేద - గతిపరిశ్రమమును గర్భనిర్ణయము - చనుబం ధములనుబుష్పాంజలియాది - జన్ప్రబంధముఖండజతియురిగువణి - తు డుకుఘుంకారంబుతుదిజనుత్కార - మమురంగవాద్యచూడాదులుమెరసి నరులల్లిభరతుండునందికేశ్వరుడు- ధరమదర్శములలోఁదానువాయింప - స్ఫుటతరంబుగగచ్ఛవుటయునుబూచ- వుటయుపడ్గీతయుస్ఫుటితనమోది

